# ఖూనీ

కవిరాజు

సూతాశ్రమము
తెనాలి

# తొలి పలుకులు

ఒకనాఁటిప్రొద్దున మా స్నేహితుఁడు మ. రా. రా. శ్రీ నండూరి శేషాచార్యులుగారియింటికి నుబుసుపోకకునై పోయితిని. మేజాబల్లపై విశ్వనాథ సత్యనారాయణగారు రచించిన 'వేన రాజు' వ్రాఁతప్రతి పడియున్నది. తీసి చదువుట కారంభించితిని. చదివినకొలంది యాందోళనపడితిని. చదువుట పూర్తికామిచే నాచార్యులుగారి యనుజ్ఞతో నా గ్రంథమును నింటికిం గొం పోయి పూర్తిచేసితిని. కలవరపాటు గలిగినది. నిజముగ వేన రాజు మనుజుల పుట్టెలతోఁ జెరలాడునంతటి క్రూరుఁడా, తన్మూలమున వధ్యుఁడా? యను సందియము కలిగినది. వెంటనే భాగవతములోని వేనరాజుకథను జదివితిని. నిట్టూర్పు విడ చితిని. నా సందియము పటాపంచలైనది. వేనరాజు నిక్క ముగ "ఖూనీ" చేయఁబడెనని నాకు బోధపడినది. "వేనరాజు" నాటకముచే వేనరాజునకుఁ దీరని మహాపచారము చేయఁబడిన దని నాకు గట్టిగ నమ్మకము కలిగినది. ఈ యపచారమును వెంటనే తుడిచివేసి వేనరాజునిజస్వరూపము లోకమునకుఁ బ్రదర్శించుట ధర్మమని తోఁచినది. దీనికి ఫలముగా "ఖూనీ" యను నీ చిన్న గ్రంథమునువ్రాసితిని. ఇది నా "ఖూనీ" జన్మకథనము. నాచే నీ గ్రంథమును వ్రాయించినందులకు విశ్వనాథ సత్యనారాయణ గారికిఁ గృతజ్ఞుఁడను.

మఱచిపోయిన తాతలనాఁటి ప్రాఁతకథను త్రవ్వి పెల్ల గించి విశ్వనాథ సత్యనారాయణగారు "ఆర్యఋషుల" మాహా

త్య్రమును, వారి వృత్తశీలములను క్రొత్తమాటలచే లోకమునకు బోధింపఁబూనుకొన్నారు. దీనికి వీరికి హక్కులేదని చెప్పఁజాలము. "ఆర్యఋషులకు" గంటమును జేఁబూని, గంటము పదను బోవువఱకును ఆకులు చినిఁగిపోవువఱకును ధర్మమో, యధర్మమో విచారింపకుండ వ్రాయుటకు హక్కున్నప్పుడు, సత్యనారాయణగారి కేల యట్టి హక్కుండరాదు ?

కాని యీహక్కే వేనున కేల యుండరాదని మేము వాదించుచున్నాము. ఋషులకు వ్యతిరిక్తముగా వారివాదనను బ్రతిఘటించి ధర్మప్రచారమును జేసినమాత్రమున వేనుఁడెట్లు హంతవ్యుఁడో యూహింపరాదు. వేనుఁడు హంతవ్యుఁడైనచోఁ దదితరు లేల కాఁగూడదు? పైనిం జెప్పిన కారణముచే వేనవధ గర్హితమును, దూషితమును, నింద్యమును నేల కారాదు? తాము చేసిన ఘోరకృత్యమును సమర్థించి, యయ్యదియే ధర్మమని లోకమును నమ్మించుటకుఁ దమ సంతానములో నొకరు నడుముఁ గట్టుకొని నేఁటికి బయలుదేరి రన్నమాట విన్నచో "ఆర్యఋషులు" ఎంత సంతసింతురో కదా. సత్యనారాయణగారి "వేనరాజు" ను జాగరూకతతోఁ బరిశీలించితిమేని, తా నొక యార్యఋషిసంతతివాఁడ నను నమ్మకముతో కృతికర్త వేనవధను సమర్థింప నన్నిపాటులు పడెనని బోధపడక మానదు. సత్యనారాయణగారిచే వాడఁబడిన యీ "ఆర్యఋషి" శబ్దము నేఁటి మరియొకశబ్దమును స్ఫురింపఁజేయు చున్నది. స్వజాతిదోషమును గప్పిపుచ్చుటకు మహనీయులఁదూలనాడుటతుఁదుడుకుతనము కాకుండునా? సత్యనారాయణగారు "Versatile

genius" కావచ్చును, కాకపోవచ్చును. దానితో మాకుసం బంధములేదు. వారు వ్రాసినగ్రంథముతోడను, నందలి యభి ప్రాయములతోడను మాత్రమే మాకు సంబంధము.

వేనరాజుచరిత్ర భాగవతచతుర్థస్కంధములో నున్నది. ఈ వేనుఁడు పృథుచక్రవర్తితండ్రి. భాగవతము పృథుచక్ర వర్తిని వేనునితనూజునిగాఁ జెప్పుచున్నది. తనూజశబ్ద మిట సార్థకము. అనఁగా వేనునిశరీరమథనముచేఁ బృథువు జన్మించి నాఁడని "ఆర్యఋషులు" చెప్పుచున్నారు. వేనశరీరమథనము కూడ వేనునిమరణము గల్గినవెంటనే జరుగలేదు. కొన్నిరోజు లకో, కొన్ని వారములకో, కొన్ని నెలలకో, కొన్నియేండ్లకో జరిగినట్లు భాగవతమువలనఁ దెలియుచున్నది. ఇంతకాలము చెడిపోకుండు టెట్లని పాఠకులు సంశయింప వచ్చును. "శిపివిష్ట దేవతాకం బయిన పురోడాశంబు"చేఁ గావింపఁబడిన హో మంబున బయలువెడలిన "స్నిగ్ధపాయసంబు"చేఁ గల్గినవాఁ డగుటచే నిట్టిపవిత్రదేహంబు కల్గెనని తలంపవలయును. ఏది యెట్లయిన నేమి ? వేనుఁడు పృథుచక్రవర్తితండ్రి యని పూర్వ గ్రంథములు చెప్పుచున్నవి. ఆర్యఋషులు పృథువును షట్చక్ర వర్తులలో నొకనిగాఁ జేసిరి. కాని మాయభిప్రాయమున, సుగ్రీవుఁడు, విభీషణుఁడు, ప్రహ్లాదుఁడు మొదలుగాఁ గలవారి వలె కుటుంబద్రోహి. భాగవత మిట్లు వేనునిగూర్చి చెప్పు చున్నది: అంగరాజు వెనుకటి జన్మమునందు, నీ జన్మము నందుఁ బుత్రవిహీనుఁడు. అందుచే దేవత లాహూతు లయ్యు నంగరాజు చేయుచున్న యజ్ఞమునకు రారైరి. వచ్చి పప్పు

బెల్లాలు గొనిపోయిరి. ఆర్యబుుషు లందుచే నంగరాజుచేఁ బుత్రికామేష్టి చేయించిరి. తత్ఫలముగా వేనుఁడు జన్మించెను. ఒక్కఁడే కొడుకగుటచే మారా మెక్కువయై యాతఁడాయిగాఁ బెరిగెను. అందుచే నంగరాజు కుమిలిచచ్చెను. ఆర్యబుుషు లందఱు గుమిగూడి యజ్ఞమహిమముచేఁ బుట్టిన వేనునిఁ బట్టాభిషిక్తుని గావించిరి. అంతట వేనుని నిజస్వరూపము బయటఁబడెను. ఆర్యబుుషులపైఁ దిరుగఁబడెను. రాజ్య మల్ల కల్లోల మయ్యెను. ఆర్యబుుషు లందఱు ప్రోవై చంపుట యుత్తమ మని తీర్మానించి చంపివైచిరి. వేనుని దుర్మార్గునిగాఁ జెప్పఁ దలంచిన భాగవతము చెప్పినకథ యిది. దీని సత్యాసత్యములు నిరూపించుటకుఁ దగినయాధారములు భాగవతమున నేమయిన దొరకునా యని యాలోచింపఁదగును. వేనుఁడు చిన్నతనంబున బాలురను బశుప్రకరంబును బోలె నరికట్టి చంపెనఁట. ఇది నిజమే యయినచో అంగరాజుమరణానంతరము "ఆర్యబుుషు" లెల్లరు సభచేసి విచారించి, వేనుని బట్టాభిషిక్తుని నేల చేసి యుందురు ? భవిష్యత్తెఱింగిన బుుషు లింతమాత్ర మేల తెలిసి కొనరైరి?

"మహితోగ్రశాసనుం" డయిన వేనుఁడు పట్టాభిషిక్తుఁ డయినంతనె "సమస్తతస్కరులు సర్వభీతిచేఁ దలఁగు మూషికములకై వడి" గహనములయందు నడఁగుట యేల కలి నది ? వేనుఁడు ధర్మప్రభువే కానియెడలఁ దస్కరులే భయ మందు టేల ? దీనింబట్టి చూడ వేనరాజ్యంబులోఁ దస్కరులు కానివారికి భయములే దనియే స్పష్టపడుచున్నది కదా ? ఇట్టి

ధర్మప్రభువును "ఆర్యఋషులు" ఆతతాయిగను, క్రూరకర్మ కునిగను, గసాయిగను, బ్రదర్శించి కడ తేర్చు టేల కావలసి వచ్చినది? దీనికిఁ దగినకారణము భాగవతములోనే కన్పట్టు చున్నది. వేనుఁడు పట్టాభిషిక్తుఁ డయినవెంటనే నిజస్వరూపము బయటఁబడినది. తన రాజ్యములో నాలుగుమూలలు మారుమోగ్రునట్లు లీ విధముగఁ జాటించియున్నాఁడు.

దివ్యులు వెఱఁగందఁగఁ బృ
థ్వీవ్యోమము లగల భేరి వేయించె న య
ష్టవ్య మదాతవ్య మహో
తవ్యం విప్రా యనుచు నుదాత్తధ్వనులన్.

ఈ విధముగ వేనరాజ్యంబున బ్రాహ్మణ సంతర్పణలు మాన్పింపఁబడినవి. వెంటనే మంత్రతంత్రముల వేనరాజు ఖూనీ చేయఁబడెను. ఇది యార్యఋషులపరార్థజీవనము, పరోప కారశీలత.

**వే ను ( డు**

భాగవతప్రకారము వేనుఁడు పాషండుఁడు, నాస్తికుఁడు.

పాషండుఁ డనఁగ వేదబాహ్యుఁడు. ఇందు దోష మేమి యున్నదో తెలియుటలేదు. నేఁ డీ ప్రపంచమునందు నివసించు చున్న 150 కోట్లులయందు వేదమునందు విశ్వాసము కల్గి, తద్ధర్మముల ననుష్ఠించువారు పదికోట్లకన్న నెక్కువ గానరారు. పాషండశబ్దము మతాంతరులయెడ నుపయోగించు తిట్టు. హిం

దువులు హిందువేతరులను మ్లేచ్ఛు లనియు, మహమ్మదీయులు తదితరులను కాఫరు లనియు, క్రైస్తవులు తదితరులను "హీదెన్సు" అనియును నిరంతర మొకరి నొకరు దూషించు కొనుట వినుచునే యున్నాము. ఇంత యేల? శైవులను వైష్ణవులు, వైష్ణవులను శైవులు నింతకన్నను కఠిన వాక్యములచే దూషించుకొనుట యెఱుంగుదుము. పాషండుఁ డన్నంతమాత్రముననే ధర్మపీడలు చేయువాఁ డని యర్థము రానేరదు.

నా స్తి కుఁ డు

నాస్తికుఁ డనఁగఁ దేవుఁడు లేఁడని నమ్మువాఁడని యర్థము. కాని వేనుఁడుమాత్రము నాస్తికుఁ డైనట్లు పొడకట్టదు. వేనుఁడు తానీశ్వరప్రతినిధి యనియుఁ దన యధికారమును ధిక్కరించుటకు నితరుల కధికారము లేదనియు నమ్మినట్లు లీ క్రింది భాగవతములోని పద్యములవలన నూహింప ననువు కల్గుచున్నది.

"హరిహరహిరణ్యగర్భ
స్వరధీశ్వరవహ్నిశమనజలధిపతిమరు
న్నరవాహనశశిభూరవి
సురముఖ్యులు నృపశరీరసూచకు లగుటన్.

పరికించి నను భజింపుఁడు
ధరణీశుఁడు సర్వదేవతామయుఁడగు మ
త్సర ముడుగుఁడు నాకంటెను
బురుషుఁడు మరి యెవ్వఁ డగ్రపూజార్హుఁ డిలన్."

దీనినే పాశ్చాత్య దేశములయందు Divine right of Kings, అని యందురు. నాలుగయిదు శతాబ్దుల క్రిందివఱ కీయభిప్రాయము పాశ్చాత్య దేశములయందు విపరీతముగ వ్యాపించియుండెను. దీని పిలకయే The King can do no wrongs అను నానుడి. కొంచె మించుమించుగ "ఆర్యఋషులు" కూడ నీ వాదము నంగీకరించియుండిరి; లేనిచో "నా విష్ణుః పృథివీపతి" యను లోకోక్తికిఁ గారణమే యుండదు. ఇట్టిపరిస్థితులలో నీవాదము సాకుఁ జేసికొని వేనుని ఖూనీచేయుట యెంత న్యాయమో బుద్ధిమంతు లూహించుకొందురుగాక !

కాని పరిశీలించి చూచినయెడ వేనుని యభిప్రాయము లన్నియు నాస్తికత్వమునకే దారిచూపుచున్నట్లు పొడకట్టక మానదు. వేనుఁడు బౌద్ధమతమునకు మార్గదర్శి యని యభిప్రాయపడుచుంటిమి. నాస్తికులలో లోకకంటకులుకాని, లోకపరిత్రాతారకులుకాని, కానివారు పెక్కురున్నారు. జీవకారుణ్యముకల్గి లోకకళ్యాణార్థము పాటుపడినవారు, పడుచున్నవారెంతమంది యున్నారో విజ్ఞులెఱుంగరా? రేయెల్ల మహాపాపము లాచరించి వఱువాతనే ముక్కు మూసికొని జపముచేయు వారిచే లోక ముద్ధరింపఁ బడఁగలదా? ఈశ్వరధ్యానముచేఁ బాపపరిహారముకల్గునను విశ్వాసము దోషాచరణమునకు దోహదము చేయకుండునా? ఆస్తికత్వము ప్రపంచపరిణామమునకు నాటంకములు గలుగఁజేసెను గాని, తోడ్పడలేదని గట్టిగఁ జెప్పవచ్చును.

నేడు ప్రపంచమున నున్న 150 కోట్ల ప్రజలయందు నాస్తికులే యెక్కువగ నున్నారని యెఱింగినచో భగవంతుం డెట్టిదుర్గతిపా లగుచున్నాఁడో తెలియఁదగును. ఏఁబదికోట్ల బౌద్ధులు, పదికోట్ల మతములేనివారు, ఇరువదికోట్ల చెట్లు, చేమలు పూజించువారు, మతమును బాఱఁదోలిన పదికోట్ల రషియనులు, కలిసి మొత్తము 90 కోట్ల నాస్తికులే ప్రపంచమున జీవయాత్ర గడపుచున్నవారు. ఇంతియకాక హిందూ క్రైస్తవ మహమ్మదీయమతములయందు జన్మించుటంజేసి యా యా మతములయందే నామమాత్రముగ నుండి భగవంతునియందు విశ్వాసములేనివారు వేలకొలందిగ నున్నారు. ఈ యిరువదిసంవత్సరములనుండి నాస్తికులసంఖ్య విపరీతముగఁ బెచ్చుపెఱుగుచున్నది.

**మ త ము**

వేనరాజుకాలమునాఁటికి మత మనునది యొక టున్నట్టు పొడకట్టదు. "ఆర్యఋషులు" చెప్పుధర్మములే సనాతనధర్మ మని తలంపఁబడుచుండెను. "ఆర్యఋషుల" యభిప్రాయములకు వ్యతిరేకములగు నభిప్రాయములు కలవారు పాషండులుగను, నాస్తికులుగను నెంచఁబడుచుండిరి. తన్మూలమున వారు దండ్యులో, హంతవ్యులో యగుచుండిరి. రాజులు "ఆర్యఋషుల చేతికీలుబొమ్మలుగ నుండిరి.తరువాతక్రమక్రమముగ నే మహనీయుఁడో చెప్పిన నీతు లన్నియుఁ గట్టకట్టి యాతనిపేరిట మతమని చెప్పి, తన్మతేతరుల బలవంతముగాఁ దమమతము

లోనికి దింపుట పరిపాటి యై పోయినది. ఇందుచే మతయుద్ధములు తలలెత్తసాగినవి. దేశములెల్లను మానవరక్తప్లావితములయినవి. దేశమునకు మతములు చేసిన మేలిది యొక్కటి. క్రైస్తవమతమునకు మూలస్థానమైన జెరుసలేముపట్టణము మహమ్మదీయులగు అరబ్బులస్వాధీనములో నుండుటచే నా పట్టణమును గైవసముఁ జేసికొనుటకు నెంతమంది వీరాధివీరులు హతులయిరో లెక్కపెట్టనలవియా? హిందూమహమ్మదీయులు తమతమమతములకయి పోరాడి యెన్నిలక్షలు దుర్మరణము పాలైరో కదా! సోమనాథ దేవాలయఁపుముట్టడిలో నెంతమంది జంకు గొంకు లేని రాజపుత్రసుభటులు ప్రాణముల నర్పించిరో, మతసహనము గొలఁదియో గొప్పయో యున్న హిందూ దేశమున జైనులు బౌద్ధులు వేలకొలంది మతావేశమునకు బలిచేయఁ బడలేదా? మతముపేరిటఁ బరస్పరమారణమతిదారుణముగాఁ బాశ్చాత్య దేశములయందుఁ గూడ జరుపఁబడినది. 1572 వ సంవత్సరమున ఫ్రాన్సుదేశములో 10,000 మంది ప్రొటెస్టెంటు క్రైస్తవులు జాలిలేకుండఁ గుత్తుకలు కోయఁబడిరి. స్పెయిను దేశములోఁ గ్రైస్తవమతములోఁ జేరుటకు నిష్టపడమిచే మూడువందలమంది కాల్చివేయఁబడిరి. దేవునిపేరిట నిట్టి క్రూరకృత్యము లెన్నియో జరుపఁబడినవి. భగవంతుఁ డొకఁ డున్నచోఁ దనపేర జరగుచున్న యత్యాచారములనైన మాన్పనొల్లఁడా?

మతము ప్రతిదేశమునందు సౌజన్యము, సౌభ్రాతృత్వము, సమానత్వమును జిందరవందరచేసి, మానవుల నల్లకల్లోలము

జేసి, ప్రపంచశాంతి లేకుండఁ జేయుటయే కాకుండ మహాపురు షుల నెందఱనో తనపొట్టఁ బెట్టుకొన్నది. తార్కాణముగా నొక యుదాహరణము నిచ్చెదము. సూర్యునిచుట్టు భూమియే తిరుగుచున్నదని చెప్పిన 'కోపర్నికస్' అను జ్యోతిష్కుని, రోమను చక్రవర్తి పెట్టరాని సిలుగులం బెట్టి చంపించెను. మానవుఁ డతిమూఢదశలో నున్నప్పుడు కొండగాని, ఏరుగాని, వాఁకగాని, పందిగాని, కుక్కగాని యేది యతిభీకరంబై మన స్సునకు నలజడిఁ గల్గించునో, యట్టిదానియందు భక్తివిశ్వా సములుంచి, వేడికోళ్లర్పించుట స్వభావముగాఁ గన్పట్టుచున్నది. ఇట్టి జనసంఖ్య ప్రపంచమునం దధికంబుగా నున్నదనుట స్పష్ట ము. కాని యీసంఖ్య క్రమక్రమముగాఁ బెరుఁగుటకు మారు తరుగుచున్నది. కారణ మేమి? ప్రజాసామాన్య మజ్ఞానాంధ కారబంధురముగా నున్నప్పు డుబుసుపోకకో, చిత్తశాంతికో దేవుఁ డను మాటా కొకటి కావలసియుండును. ప్రజలు జ్ఞాన చక్షువులం దెఱచి, తమలోఁ దాము తర్కించుకొనుచున్న కొ లంది భక్తివిశ్వాసములు నశింప భగవంతుఁ డున్నాడా లేఁడా యను తర్కవితర్కములు బయలుదేరుట సహజము.

మానవుఁడు మృగదశలో నున్నప్పు డే కొండగానో, యే యేరుగానో వెలసిన దేవుఁడు, మానవవిజ్ఞానము పరిణా మముఁ బొందుచున్నకొలంది, భగవంతుఁ డేరు, కొండరూప మును వదలి, మృగమై, మృగమునుండి, మనుష్యుఁడై మనుష్య దశనుండి యదృశ్యరూపుఁడై, నిరాకారుఁడై, నిరంజనుఁడై నిర్వికల్పుఁ డయ్యెను. ఇఁకఁ దరువాతిదశ యేమి? శూన్యత్వాము

అనఁగా నాస్తికత్వము. ఇదియే మూఢమానవ ప్రతిపాదితుఁడైన భగవంతునకు నేఁడు వాటిల్లుచున్న దశ. రష్యాలో నిరువదియేండ్లక్రిందఁ బయలుదేరిన యీప్రశయఝంఝూమారుతమునకు భయపడి యచ్చటి గుడులు (Churches) లో నున్న భగవంతుఁడు కాలిచప్పుడు కాకుండ నెచ్చటికో దారితీసెను. ఈ యిరువది సంవత్సరములలో నచ్చట బయలుదేరిన సాంఘిక మానసిక పరిణామము బహు విచిత్రమై ప్రపంచమునకు విస్మయముఁ గొల్పుచున్నది. ఈ విచిత్ర పరిణామమును జూచి ప్రపంచమునందలి రాజకీయవేత్తలందఱు దిగ్భ్రమఁజెంది ప్రపంచ మేమగునో యని దిగులుపడుచున్నారు.

రషియాయందుఁ బది పదియేను కోట్ల జన మున్నది. యూరపుమహాసంగ్రామమునకుఁ బూర్వ మీదేశమును "జారు" అను బిరుదుగల యొకచక్రవర్తి పాలించుచుండువాఁడు. ఈ జారును రషియను లందరు (Little God) చిన్న దేవుఁడని పిలుచుచుండువారు. జారుపరిపాలనలో నున్నంతకాలము రషియాయందు మతావేశము మెండుగ నుండెను. రాజశాసనముచే నెల్లరు విసుగు, విరామము లేక భగవత్పూజ చేయవలసియుండెను. దీనికిఁ బ్రతిఫల మేమి? ప్రజలలో నూటికి డెబ్బదిమందికిఁ గూడు గాని గుడ్డగాని మంచముగాని కంచముగాని లేకుండెను. యూరపుమహాసంగ్రామముమధ్య జరిగిన మహాదారుణమైన జారుహత్యకు భయపడి భగవంతుఁడు రష్యాను వదలి పలాయితుఁ డయ్యెను. చిన్న దేవుఁడు చావఁగాఁ బెద్ద దేవునికి గతి లేకపోయెను. గుడు లన్నియు యంత్రాగారములు

గను, పుస్తకభాండాగారములుగను మారిపోయెను. గుడుల కున్న మడిమాన్యములు ప్రభుత్వవశ మైపోయెను. తలఁదాచి కొనుటకు నిల్లు వాఁకిలి లేనప్పుడు భగవంతుఁడు మాత్ర మేమి చేయఁగలఁడు ? ఈ మార్పువల్ల రషియాదేశమునకుఁ గల్గిన కెఫల మేమి ? నూటికి డెబ్బదిమందికిఁ దినఁ గూడును, కట్ట బట్టయుఁ, బండ మంచమును, సాపడఁ గంచమును లభించి నవి. పురుషకార మప్రతిహతమగు నధికారము చెల్లించుకొను చున్నది.

ప్రార్థించినంతమాత్ర, సేవించినంతమాత్ర, కైంకర్యము చేసినంతమాత్ర భగవంతుఁడు ప్రీతుఁడై, సిరిసంపత్తుల నిచ్చి, పరలోక సౌఖ్యములు గల్పించు ననుట నమ్మఁదగిన దేనా ? ఇట్టివి యెన్నడు, నెచ్చటను జరిగియుండలేదు. ఇయ్యది మానవ హృదయ దౌర్బల్యమును సూచింపక తప్పదు. ఈ ప్రార్థనలు, ఈ సేవలు, ఈ కైంకర్యములు స్వాతంత్ర్యమును గోల్పుచ్చి, పురుషకారమును నశింపఁ జేసి మానవులను నం బేదలగు బానిసలనుగాఁ జేయుట కుపకరించునుగాని మఱెందు లకుఁ గొఱగావు.

పాపండు లైనంతమాత్రమునఁ (అనఁగా వైదికధర్మము లను ననుష్ఠింపనంత మాత్రమున) మానవుఁడు పాప కర్మములను చరించు నని కాని ధర్మపీడలను సల్పునని కాని చెప్పుట లోకమునెడ మహాపచారము చేయుట యగును. భగవంతుని ప్రేమించుటకన్నఁ, దోడిమాన

వులఁ బ్రేమించుట పరమోత్తమంబు. పాషండుఁ డనఁగా సకలపాపములను జేయువాఁ డని ప్రాకృతలోకంబునఁ గల యూహలను నాధారముజేసికొని విశ్వనాథ సత్యనారాయణ గారు వేనరాజును నావిధముగ నభివర్ణించియున్నారు. ఇది కేవలము పొరపాటు. పాషండులయం దెట్టి పవిత్ర జీవనము సల్పిన యుత్తమపురుషు లున్నారో లోక చరిత్రఁ జదివిన వారికి బోధపడకపోదు. కావుననే పాషండు లైనంతమాత్ర ముననే మానవులు దుర్మార్గులు కారనియు వేనరాజు పాషం డుఁడైనను, సత్యనారాయణగారు చిత్రించినట్లు దుర్మార్గుఁడు కాఁడనియు రుజువుచేయుటకే "ఖూనీ" వ్రాయఁబడినది.

సూతాశ్రమము,
1 . 9 . 35.

కృ తి క ర్త.

# ఖూనీ

[మొదటిరంగము — మునిపల్లి; యజ్ఞశాల; గౌతముఁడు, శునశ్శేపుఁడు, వటువులు; నవరంధ్రములు బిగించి పట్టుకొనఁబడిన మేఁక; యజ్ఞగుండము, సమిధలు, సమిధలతోఁ బ్రజ్వరిల్లుచున్న యగ్నిహోత్రము.]

వేనుఁడు : [పేరెలుంగునఁ దొందరతో] ఓహో! యాశ్రమవాసులగు యాయజూకులారా! ఏమి యీయాగము? ఏమి యీ యాగము; చాలింపుఁడు; చాలింపుఁడు; జంతుబలి యే రూపమునన్నైన సరియె, వేనరాజ్యంబున నిషేధింపఁబడుట యెఱుంగరా ? ఎఱిఁగి యెఱిఁగి యిట్లు శాసనతిరస్కారముఁ గావించి, దండ్యు లేల యయ్యెదరు? నవరంధ్రములు బిగియఁ బట్టి యీ దిక్కుమాలిన యజమును యజ్ఞగుండమున వేల్చుటకు సాహసించుచుంటిరా. ఒక్కసమిధ యజ్ఞగుండమునఁ బడెనా యొక్క ప్రాణ మెగిరిపోవును. భీకరశాసనుండగు

వేనునిశాసనంబు ధిక్కరించి యెవరు బ్రదికిపోవఁగలరు? ఆతఁడు చారచక్షువుకాఁడు. అతఁడు స్వయముగఁ దన రాష్ట్రమెల్లఁ గ్రుమ్మరుచుండును. ఎవ్వరును దప్పించుకొనిపోవలేరు. [ధృష్టవర్మద్వితీయుఁడై ప్రవేశించి] గౌతమా! యేల యిట్లు దిగులుపడి బిక్కమొగముతో వెఱ్ఱిచూపులఁ జూచెదవు? ఈ దొంగజన్నమునకు మునిపల్లెయే కావలసివచ్చినదా?

గౌతముఁడు: ఏమి యీ యహంకారము? ఆర్యఋషుల యెదుటఁ గూడ నీ యహంకార ప్రదర్శనమా? చాలుం జాలు. బ్రహ్మవిద్వరిష్ఠులచేఁ బవిత్రీకృతములగు మునిపల్లెలుకూడ నేఁటికి యహంకార ప్రదర్శనముం జూడవలసి వచ్చెఁగా? ఆర్యఋషులం దిరస్కరించి శాపదగ్ధుఁడు కాక బ్రదికిపోయినవాఁ డింతకుమున్నెవండు కలఁడు?

వేనుఁడు: నేనుమాత్రము బ్రదికిపోదు నని చెప్పుచుంటినా? బ్రదుకవలయునని కోరుచుంటినా? కాని గౌతమా! మీ ఋషిపరంపరయందు పుట్టి గిట్టనివాని నొకనిం జెప్పుము. మీతండ్రితాతముత్తాతలు చావక మిగిలియున్నారా? సిగ్గులక యొకనిఁ జంపుటకూడ గొప్పయే యని కొండాడుచుంటివి. బెబ్బులి సాధుమృగంబులఁ జంపుటలేదా? భేదమేమి యున్నది? గౌతమా! యొకవేళ నీవంటిమహర్షి యెవ్వఁడయిన నన్ను ఖూనీ చేయుటకు సిద్ధపడిన యెడల, నిప్పుడు నేఁ బూనిన ధర్మము స్థాపింపక పూర్వము, ఒక

వేళ నది సాధ్యపడక పోయినచోఁ బ్రిచారమయినను జేయకపూర్వముమాత్రి మట్టిది తటస్థింప దని గట్టిగఁ జెప్పుచుంటిని.

గౌతముఁడు : ఏమి యీ యహంకారము? చావుబ్రదుకులు కూడ నీ చేతిలో నున్నట్లు మాటాడుచుంటివి.

వేనుఁడు : అహంకార మహంకార మని యెత్తి పొడుచు చుంటివి. అహంకారము లేని యభాగ్యుఁ డెవ్వఁడు? అహంకారము లేని దీ ప్రిపంచ మొక్క గడియయైనను సాగునా? అహంకారము లేనిరాజు రాజ్యమేలఁగలఁడా? వేయేల? నీవాక్యము లహంకారద్యోతకములు కావా? ధృష్టవర్మా! ఈ గౌతముఁడు మాటలంజెప్పి మనలను మఱపించుచున్నాఁడు. ఏల యట్లూరక చూచెదవు? ఆమేఁక యుక్కిరి బిక్కిరియై చచ్చిపోవుటకు సిద్ధముగ నున్నది. మునుముందు వారల నవలకు గెంటి యామేఁకను గాపాడుము. ఆవల వాదించు కొందము.

ధృష్టవర్మ : చిత్తము, మహాప్రిభూ! [మేఁకవైపునకు నడచును].

గౌతముఁడు : ధృష్టవర్మా! ఆగు మాగుము; ఏమి యీ తుందుడుకు? మంత్రిపూతమైన యాయజమును నీవు స్పృశింపరాదు.

ధృష్టవర్మ : నేను మేఁకను స్పృశించువఱకు దానిని విడువ నొల్లరా? ఏమి యీతిరస్కృతి? నన్నుఁ బల్కరింపకుము. నాకుఁ బ్రభునాజ్ఞ యొక్కటియే యాచరణీయము. వే రొండుతో నాకుఁ బని లేదు.

గౌతముఁడు : అహో! యేమి యీ దుండగము. నేఁటికి మునిపల్లెలుకూడఁ బాషండ షండ పాదధూళీధూసరితము లగుచున్నవి. యజ్ఞశాల కెట్టి గతి పట్టినది! ధృష్టవర్మా! యవమానితులయిన యార్యఋషు లూరకుందురా? ఎన్నఁ డయిన నూరకుండిరా! వాగ్బాణులయిన ఋషులం జెనకి యెవ్వఁడు సుఖనిద్ర చేయంజాలును?

వేనుఁడు : గౌతమా! పరుషవాక్యములతోఁ బ్రయోజన మేమి? తిట్టుఁబోతులకు భయపడువారు నేఁడున్నారని యేనా నీ యభిప్రాయము? మదీయ బాహుయుగళీ వప్ర గుప్తుండవై మునిపల్లె సురక్షితుండ వయిన నీవు తెగఁబడి నన్నుఁ బాషండుఁడ వని దిట్టనుంకింతువా? ఇది యేమి ధర్మము? పొగడ్తలకును, దెగడికలకును వేనుఁడు చలించి ధర్మపథమును వీడువాఁడు కాఁడు. అతఁ డచలుఁడు. అతని ధర్మ మచలము. అతండు పాషండుఁడైననేమి? షండుఁడైన నేమి? అతం డెవ్వఁడైననేమి? అతనిరాజ్యముననున్న ప్రజలు సుఖజీవనము చేయవలయును. సుఖనిద్రఁ బొందవలయును. ఇదియె యతనిపరమావధి. ఇంతియె కాక యతని నాల్గుచెఱ గుల నేలయందలి భూతజాలము పశుపక్షి క్రిమికీటకాదులు

సైతము బాధనొందరాదు. బాధనొందిన, వేనుని మనస్సు తరుగుకొనిపోవును. వానికి నిద్దురపట్టదు. వానికి జీవనమే దుస్సహ మగును. పెక్కు మాట లేల? ఈ యజ్ఞములు, ఈ యాగములు లోకకల్యాణార్థమని నీవు రుజువుపఱుపఁ గల్గినచోఁ బూర్తిగావింప నేననుజ్ఞ యిత్తును. లేనిచో నొక్క సమిధయైనను నీ యజ్ఞగుండమున మండదు.

గౌతముఁడు : వేనరాజా! ఎందులకీ మొఱటిపట్టు? దీన నుభయులకు మేలు లేదు.

వేనుఁడు : నే నడిగినదానికిఁ బ్రత్యుత్తర మిమ్ము, నా కితర ముతో సంబంధంబు లేదు.

గౌతముఁడు : అటు లయిన వినుము.

అంగవంశోద్భవు లన్యాయవర్తులై
శిష్టమార్గములఁ బాసినదిలేదు,
విపరీతధర్ములై వేదోక్తకర్ముల్
చేసేతఁ ద్రోసివేసినదిలేదు,
అధికారబధిరగర్వాంధులై ప్రల్లద
మ్మునఁ బ్రజాపీడ సల్పినదిలేదు,
అన్యరాజన్యజన్యాటోపదీనులై
నృపతిధర్మముల మానినదిలేదు,
అతిసుభిక్షంబుగాఁగ రాజ్యంబు లేలి
చుట్టుప్రక్కలు నల్గాళ్ల పుట్టఁజేసి

బ్రాహ్మణాశీస్సులను బొంది పరమపదముఁ
జేరినారు మఱి మీవారు, పేరుమోసి.

ఇట్టిమహనీయవంశంబున జన్మించి, మీపూర్వుల పోక డల నీసడించి చరియించుట ధర్మమగునా ?

వేనుఁడు : గౌతమా! నీమాటలు గాదననేల? నీ చెప్పిన మాటలన్నియు నిజమనియే నమ్మెదను. ఇప్పు డీ ప్రసంగము వలన లాభ మేమియున్నది? మాపూర్వులు తాము నమ్మిన ధర్మములనుగట్టిగా నిలువఁబెట్టిరి. పూర్వాచారములన్నియు ననుసరణీయము లనియే మీరు చెప్పఁగల్గుదురా? దేశకాల పరిస్థితులంబట్టి యాచారములు మాఱుచుండవా? తొల్లి వారు విశ్వసించినధర్మముల వా రాచరించిరి; నేఁడు నేను విశ్వసించిన ధర్మముల నే నాచరించుచుంటిని. కాన నా యంతఃకరణప్రవృత్తికి విపరీతము లయిన ధర్మముల నారా జ్యమున నడుగుపెట్టనీయను. భూతదయకు విరుద్ధము లయిన పనులం జూచిన నాగుండె నీరై పోవును. నేను జూడ లేను. మంచి కానీ, చెడ్డ కానీ నాయవస్థ యిది. మునీంద్రా! మాటలతోఁ బ్రొద్దుపుచ్చకుము. ఈయజ్ఞయాగములు లోకకల్యాణార్థమని సిద్ధాంతీకరింపఁ బ్రయత్నింతువా? లేదా? కాలయాపన సహింపను.

గౌతముఁడు : ఇటు కూర్చుండుము - చెప్పెదను. తొందఱపడ నేల? రాజవు, మాయింటి కతిథివై వచ్చితివి. ఇంతమాత్ర మాతిథ్యము స్వీకరింపఁగూడదా?

వేనుఁడు : ఇంటికి వచ్చినవాని కాతిథ్య మీయవలయు నని యిప్పటికిఁ దెలిసినదికాఁబోలు. నాకు మర్యాదలతోఁ బని లేదు. మి మ్మెయ్యలజడి లేకుండఁ గాపాడుచున్న నాయాజ్ఞల యందు గౌరవముఁ జూపలేనినీవు నాయెడ గౌరవముఁ జూప నేల యత్నింతువు?

గౌతముఁడు : వేనరాజా! యే కారుకోనలోనో యే మారుమూలనో పారుటాకులయిండ్లలోఁ గాపురముఁ జేయు మాకు నతిథి, యభ్యాగతిపూజలు క్రొత్తలుసుమా! ఎందుల కొకరి నొకరు వేళాకోళముఁ జేసికొనుట? నీ వడిగిన ప్రశ్నకు సమాధాన మిత్తును; శ్రద్ధాళుఁడవై వినుము.

వేనుఁడు : సిద్ధముగ నుంటిని; విన్పింపుము.

గౌతముఁడు : ఎఱుంగుదువుకా దే మేఘములు ధూమయోనులని పిలువంబడుట.

వేనుఁడు : ఎఱుంగుదును. అయిన?

గౌతముఁడు : ధూమయోను లనఁగా ధూమముచేఁ బుట్టింపఁబడునవి.

వేనుఁడు : ఏధూమముచే?

గౌతముఁడు : యజ్ఞధూమముచే.

వేనుఁడు : ఇతరధూమముల కేల యన్వయింపదు?

గౌతముఁడు : యజ్ఞధూమమునందున్న మహాశక్తి వాని యందు లేదు గావున.

వేనుఁడు : ఎవరు దీనిని గనిపెట్టిరి?

గౌతముఁడు : ఆర్యఋషులు; త్రికాలజ్ఞులగు ఋషులు వెఱ్ఱివా రని తలంచుచుంటివా?

వేనుఁడు : ఋషులు వెఱ్ఱివారని నే నెన్నఁడును దలంపను. కాలచక్రము నెదురు త్రిప్పనేర్తురు. ఋషులే మాబోంట్లను మూర్ఖు లని తలంతురు. ఎందుల కిగోడవ, నీవు చెప్పఁ దలంచుకొన్న దేదియో చెప్పరాదా?

గౌతముఁడు : మేఘములు ధూమయోను లగుటచేత నే మీ శ్రేయస్సు గోరు మేము మీ యాజ్ఞాతిరస్కారముఁ జేసి యైనను యజ్ఞములు చేయఁబూనితిమి.

వేనుఁడు : కారణము ?

గౌతముఁడు : కారణమా? కఱవు రాకుండుటకుఁ బాడిపంటలు మూలము, పాడిపంటలకు వఱపులేమి మూలము, వఱపు లేకుండుటకు వానలు మూలము, వానలకు మేఘములు మూలము, మేఘములకు ధూమము మూలము, ధూమమునకు యజ్ఞములు మూలము.

వేనుఁడు : యజ్ఞములకు ఋషులు మూలము, ఋషులకుఁ గుటీరములు మూలము, కుటీరములకు నాశ్రమములు మూలము, సరిపోయినది, నీ వాదము నెగ్గినది, నాసందియము దీరినది. ఇం కేమి వలయును ? కాని గౌతమా ! యెవ్వరితో మాటాడుచుంటివో యించుకంతయైన నీకు బోధపడ లేదా ? మహావిదుషీమణియు, సదసద్వివేకసంపన్నయు, సృష్టిరహస్యజ్ఞానచతురమతియు నగు సునీథా దేవిచే బోధింపఁబడిన వేనుఁ డీకుతర్కమునకుఁ జెవి యొగ్గుననియేనా నీ నమ్మకము? పొగచే మొయిళ్లు, మొయిళ్లచే వానలు, వానలచేఁ బాడిపంటలు, పాడిపంటలచేఁ గాటకము తొలఁగుట; తన్మూలమున యజ్ఞములు లోకకల్యాణప్రదాయకములు. మేలు మేలు! నారాజ్యంబున యజ్ఞయాగములు మాన్పింపఁబడి యెన్నినాళ్లయినదో యెఱుంగుదువా ? నాఁటనుండియు నేఁటిదనుక మేఘములు కంటంబడుచునే యున్నవే. ఇవి పొగచేఁ గల్పింపఁబడిన మేఘములు కావా? ఈ జన్నంపుఁబొగ మొయిళ్లను సృజించునో, లేదో కాని యాశ్రమంబుల నన్నిఁటిని నల్లూళ్లను జేసివైచుచున్నది.

జన్నంపుఁబొగమంచు చదలు గప్పకయున్న
నెల మూఁడువానలు నిలిచికురియు
విత్తనంబులఁ దెచ్చి, వెదజల్ల మోసెత్తి
ముక్కారుపంటలు పిక్కటిల్లు
అన్ని కారులయందుఁ గ్రొన్ననల్ కొనసాఁగి
విరితీవియలు పూలు, విరియఁ బూచు

చవిగల్గు రుచిగల్గు, చాల కమ్మనిపండ్లు
పండ్లచెట్ల నెపుడు, పండఁగాయు
గరిక కలివేరు చిప్పర, కనుము మొలవ
పచ్చిబీళ్లపైఁ దిరుగాడు పాడిమొదవు
పాడియిచ్చును బానలు పట్టకుండ
క్షామ మెఱుఁగవు నే నేలు సీమ లెల్ల.

శునశ్శేపుఁడు : వేనరాజా ! నీవు చెప్పిన దంతయు నిజమే, కాని యిది యంతయు నీధర్మ సంస్థాపనప్రతిఫలం బని తలంచుచుంటివా? యెంత వెఱ్ఱి? మీవంశమునందలి ప్రేమచే నెంతమంది మౌనులు నీరాజ్యమునందలి కీకారణ్యముల యందు నిల్చి యజ్ఞములు చేయుచున్నారో నీ కేమి తెలి యును? ఆయజ్ఞయాగములే లేకయున్న నీ రాజ్య మింత సుభి క్షముగా నుండవచ్చునా ?

వేనుఁడు : ఓహో ! శునశ్శేపా ! క్రొత్త వింతలు దెలుపు చుంటివి. మీ రెంతకైనను దగుదురు. ఈవిధంబుగ దొంగ జన్నంబులు చేయుఋషులింక నారాజ్యంబున నున్నారుగా. ఇందు నే నాలసింపరాదు. నారాజ్య మెల్లఁ గ్రుమ్మరి యట్టి వేమయిన నున్నచో వెంటనే మాన్పింపవలయును. శాసన ధిక్కార మెంత చులకనమైనది. గౌతమా ! యొకమాటఁ జెప్పుచుంటిని. నీ బూకరింపుమాటలతో లాభ మేమియును లేదు. మాటలం జెప్పి నన్ను మోసగింపనేరవు. నే నంగ రాజ్యసింహాసనం బధిష్ఠించినప్పటినుండియుఁ గఱవు లేదు,

వఱపులేదు. ధర్మసంస్థాపనపటిష్ఠంబైన నా ద్రాఘిష్ఠ ఖడ్గ ధారాధాళధళ్యమును జూచి జారచోరులు పరసీమలకు దారి తీసిరి. పౌరులు పిక్క బెదరు లేక తమతమ కార్యములయందు నిమగ్నులై యున్నారు. క్షుధాతురు లెందుఁ గనరారు. జానపదులు సైతము ఱొమ్ముపైఁ జే యిడికొని, భయము లేక హాయిగా నిదురించుచున్నారు. ధృష్టవర్మా! యీ గౌతముని వితండవాదమువల్లఁ బ్రయోజన మేమియును లేదు. ఆలసింపకుము. ఆ రావిపై ఘూ్యళిక కాలిపోవుచున్నవి. యజ్ఞగుండమును జల్లార్చివైవుము. భగవంతుఁ డొకఁ డున్నచో నోరు వాయిలేని యీ మేఁకమాంసమును గోరునా ?

శునశ్శేఫుఁడు : వేనరాజా ! నీ తండ్రితాతలు, ముత్తాత లెఱుఁగని ధర్మసూక్ష్మము లెఱింగితివి. అహో! మేధా విశేషము. ఈ పశువిశసనము దేవప్రీత్యర్థము కాదు.

వేనుఁడు : క్రొత్తదారి త్రొక్కుచున్నావే ? కాకున్న మఱి దేనికి ?

శునశ్శేఫుఁడు : ఋషులు స్వార్థపరులు గారనియుఁ, బరార్థ జీవను లనియు నెఱుఁగుదువా ?

వేనుఁడు : ఎఱుఁగ కేమి ? ఎఱుఁగుదును. అయిన?

శునశ్శేఫుఁడు : ఈ యజ్ఞముచే నీయజ్ఞపశు వుత్తమపదంబును బొందును.

వేనుఁడు : మఱి యజ్ఞకర్తయో ?

శునశ్శేఫుఁడు : అతండును నుత్తమలోకప్రాప్తిఁ గాంచును.

వేనుఁడు : ఓహో ! యిదియా పరార్థజీవనము? మేలు! బుషు లింత పరార్థజీవనులే యగునెడల నింకొకపనిఁ జేయరాదా !

శునశ్శేఫుఁడు : ఏది యాపని ?

వేనుఁడు : మీకులపతియు, గురువునైన యీ వృద్ధగౌతముఁడు నిన్ను యజ్ఞపశువుంగాఁ జేసి, యీ యజ్ఞమును ముగించినచో లోక మెంత సంతసిల్లును? ఒక్క యజ్ఞము చేతనే గురుశిష్యు లిరువు రుత్తమలోకంబును బొందఁగల్గుదురుగదా ? మీజాతికైనను జెందని యీ మేఁకకు సద్గతులు కల్పించుటకంటెఁ జిన్ననాఁటనుండియుఁ గొలిచి సేవించుచున్న నీకు నుత్తమలోకంబు కల్పించుట సమంజసము కాదా ! గౌతమా ! దీనికి నీ వేల యొడంబడవు ? ఇందుఁ దప్పే మున్నది ?

ధృష్టవర్మ్మఁడు : దేవా ! యీశునశ్శేఫుని యూపంబునకుఁ గట్టివైతునా ? శునశ్శేఫా ! యింత చవుకగా నుత్తమలోకంబులు కల్గుచున్నపుడు నీ వేల యాలసింతువు ?

వేనుఁడు : ఆతండు యజ్ఞపశు వగుటకు నిష్టపడినప్పుడుకదా యూపంబునకుఁ గట్టివైచుట. శునశ్శేఫా ! యింతకును జెప్పవైతివి, యుత్తమలోకము లనఁగా నేమి? స్వైరవిహారము, సురాపానము, వృద్ధవేశ్యావనితాజనతాపాంగవీక్షణము లేనా ?

గౌతముఁడు : విశ్వాసమే లేని నీకు వీనితోఁ బని యేమి ?

వేనుఁడు : తెలిసికొన్నపిదప నైనను విశ్వాసము కలుగ వచ్చునుగదా. దయ యుంచి తెల్పుఁడు.

శునశ్శేఫుఁడు : ఇవి కొన్ని.

వేనుఁడు : మిగిలినవి ?

శునశ్శేఫుఁడు : ఎందుల కీయెక్కసక్కెయములు?

వేనుఁడు : ఎక్కసక్కెయము లేమి ? ఇవియే యైనచో నీభూలోకంబున దొరకవా? విచ్చలవిడిఁ దిరుగరాదా? గొంతు బంటి త్రాగరాదా? ముదుసలిపడపుఁగత్తెలకౌగిళ్లఁ గులికి కులికి లాలాద్రవంబును జవిచూడరాదా ? స్వార్థపరత్వ బుద్ధిచే నొక్కదిక్కుమాలిన జంతువును జంపి యుత్తమలోకమును బొందయత్నించుట మానవుఁడు చేయఁదగిన కార్యమేనా ? పరలోకము లున్నవో లేవో? ఉన్నచో నవి యుత్తమ లోకము లగునో కాదో? అగుచో నీమేఁకను నగ్నిలో వేల్చి తిన్నంతమాత్రమున నవి చేఁజిక్కునో చిక్కవో; ఇట్టి సంశ

యాస్పదము లగు పరలోకసౌఖ్యముల కాసించి భూతదయ నుజ్జగించి పరహింసఁ బొనరించి మూర్ఖుండ వేలయయ్యెదవు?

శునశ్శేఫుఁడు : ఇది వికత్థనము, అధిక్షేపము, దుస్సహము.

వేనుఁడు : నామాటయే నీకు దుస్సహ మైనప్పుడు, నిండు ప్రాణముతోనున్న యొక్క సాధుమృగంబును నవరంధ్రములు బిగించిపట్టి, బగ్గుబగ్గున మండు మంటలో వైచి కాల్తు రన్నచో నేపడు మనోవేదన యెవ్వఁ డెఱుంగ నేర్చు? శునశ్శేఫా! లే లెమ్ము, యజ్ఞము మాని సర్వభూత సమభావుఁడవు కమ్ము. ఈ వృద్ధగౌతముని మాటలు విని మతి చెడఁగొట్టుకొనకుము.

గౌతముఁడు : ఈ పరుషవాక్యములు కర్ణశూలములును, మనశ్శల్యములును.

వేనుఁడు : ఈ కల్లకన్నీటిబొట్టు లేటికి? నిరంతరము ముసలి వలె కన్నీ రేల కార్చెదవు? ద్విజేతరుఁడు వేదంబును విన్నంతమాత్రముననే కర్ణరంధ్రములఁ గరగించినసీసము నుం బోయు మన్నప్పుడు నీ మన స్సెట్లుండెను? ఎందుల కీ కపటవేదన?

శునశ్శేఫుఁడు : వేనరాజా! ఎంత యధికార మున్నను, ఆ యధికార మెంత యప్రతిహత మైనదైనను, ఇంత విశం

కటముగా సంచరింప ధర్మమగునా? ప్రజలను గాపాడి, తెలిపి సన్మార్గమున నడిపింపవలసిన మహారాజవు, పూజ్యులగు నార్యఋషులచేఁ బ్రయుజ్యమానము లయిన యజ్ఞములు మాన్పి నరకలోకగంతవ్యుఁడ వేల యయ్యెదవు?

వేనుఁడు : శునశ్శేఫా! ఋషు లెట్టికార్యములు చేసినను వానికిం దల యూపకున్న నరకలోకమునకుఁ బోవలసిన దేనా? ఎందుచేత!

శునశ్శేఫుఁడు : వారు పరార్థజీవనులు గాన.

వేనుఁడు : తా ముత్తమలోకమును బొందఁగోరి యే జంతువునో యగ్నిగుండమున వేల్చుట, పరార్థజీవనుల లక్షణమేనా?

శునశ్శేఫుడు : ఋషితిరస్కారము నరకలోకమునకు దారి తీయును.

వేనుఁడు : ఎచ్చట నున్నది? ఎంత దూరములో నున్నది యానరకలోకము? నీవుగాని, నీ గురుపరంపరలో నెవ్వరయినఁగాని యెప్పుడయినఁ జూచివచ్చితిరా, మాటిమాటికి నెఱిఁగియున్నట్లు మాటలాడుచుంటివి.

గౌతముఁడు : రాజా! నీ నాలుక చీలిక గాకున్నది. ఎట్టెట్టి మహనీయుల నిందించుచున్నావు.

వేనుఁడు : మీ రే కోరికనైనను గోరుకొందురుగాని, యీ కోరికమాత్రము గోరుకొనకుఁడు. నా నాలుకయే చీలికయైనచో నాభీలవ్యాళము నయ్యెద. అప్పుడు మఱింత భయంకరుండగా నుందును. దయ యుంచి న న్నీరూపముననే యుండనిండు. మీ తపశ్శక్తి గూడ వ్యయము గాకుండు.

శునశ్శేఫుఁడు : ఈ యెత్తిపొడుపులతో మన స్సారాటపడుచున్నది. వేనరాజా ! యెవ్వ రడ్డుపడినను నీకుమాత్రము నరకము దప్పదు.

వేనుఁడు : ఒక రడ్డుపడుట యేల? నేనే పోదును, బోవలసిన యగత్యము కల్గుచో. కాని యచ్చట మీవంటి ఋషులుగాని, యిటువంటి కటికదుకాణములుగాని, యిటువంటి ధర్మపీడలుగాని యుండునా?

శునశ్శేఫుఁడు : మావంటి ఋషు లచ్చట నెందుల కుందురు ?

వేనుఁడు : మీవంటి ఋషులే యచ్చట లేకున్న నేను గాపురము పెట్టుటకు నాక్షేపణ మేమి యుండు ? నాకుఁ బరమసమ్మతము. స్వర్గమున మీవంటి ధర్మద్రోహుల పొత్తునఁబడియుండి, మనోవేదనఁ బడుటకన్న మీరు లేని నరకమున నొంటరిగ నుండుట మేలుకాదా ? ఇన్ని యజ్ఞపశువులు, యజ్ఞగుండమునఁ బడకుండఁజేసి ప్రాణదానముఁ జేయుచున్న నేను నరకలోకమునకుఁ బోయినను మేలేయగుఁగాక,

ప్రాణప్రదానమునకుఁ బ్రతిఫలంబు నరకలోకమా ? ఎవ్వరు నాకీ నరకలోకము నిచ్చునది ?

శునశ్శేఫుఁడు : భగవంతుఁడు.

వేనుఁడు : ఎవ్వఁడీ మహానుభావుఁడు? ఈయనప్రకృతియేమి? ఇంతవఱ కెప్పుడును నా రాజ్యంబునఁ గన్పట్టలేదే ! ఇంతకుఁ జెప్పవైతివి: యీయన యుద్యోగ మేమి ?

శునశ్శేఫుఁడు : సర్వాంతర్యామి, సర్వప్రపంచ సృష్టి స్థితి లయహేతుభూతుఁడు. దుష్టుల శిక్షించుట, శిష్టుల రక్షించుట యీయనయుద్యోగము. అహోరాత్రము లీ ప్రపంచములఁ గనిపెట్టికొనియుండు.

వేనుఁడు : పాప మెంత బాధపడుచుండునో నిద్రాహారములు మాని, రేఁబవలు కనిపెట్టికొనియుండి. ఈ మహామహుఁడేనా నాకు నరకలోకము దానము చేయునది? జీవహింస సల్పుచున్నందులకు మీకు స్వర్గము, దానిని బాపుచున్నందులకు నాకు నరకము. ఈ దేవుని మీరు క్రొత్తగా సృజించినట్లున్నది. ఈ మీ దేవుఁడు తన ధర్మమునుగూడ మఱచువాఁడుగ నున్నాఁడు. ఎంతమంది దుష్టులు శిక్షను దప్పించుకొని పోవుచున్నా రీలోకమున ? ఎంతమంది శిష్టులు శిక్షింపఁబడుచున్నారు.

గౌతముఁడు : కటా కటా! భగవానుఁడు కూడ నీ పరిహాసమునకుఁ బాత్రుఁ డయ్యె. నీకుఁ బ్రాయశ్చిత్తమే లేన ట్లున్నది.

వేనుఁడు : నాకుఁ బ్రాయశ్చిత్తమే లేనట్లున్నది; నీకుఁ జిత్తమే లేనట్లున్నది.

గౌతముఁడు : ఏమేమి?

వేనుఁడు : ఏమున్నది? ఒకరికిఁ బ్రాయశ్చిత్తము, నింకొకరికిఁ జిత్తము లేనట్లున్నది. లేనిచో దృగ్గోచరుఁడు కాని వాఁడును, మానవులచే సృజింపఁబడినవాఁడును సృష్టిస్థితిలయకారకుఁ డేమి? సృష్టిస్థితిలయములు స్వభావజన్యములు కావా? మన కంటికిఁ గన్పట్టుటలేదా? పుట్టినది గిట్టకున్న దేది? ఇందులో భగవంతునకుఁ బెత్తన మేల?

గౌతముఁడు : పాపము శాంతించునుగాక! దినదిన మీలోకమున జరుగుచున్న కార్యక్రమమునందు భగవంతునకుఁ బెత్తనమే లేదా? ఏమిపాపముఁ జేసికొంటినో కాని యిట్టి మాటలు వినవలసివచ్చినది.

వేనుఁడు : తొల్లి నీ వేమి పాపముఁ జేసితివో యెవ్వఁ డెఱుఁగు? నేఁడుమాత్రము యజ్ఞమిషంబున మహాపాపంబును మూఁటఁ గట్టుకొనుచున్నావు. ఇది యటుంచుము. నీవు చెప్పిన చొప్పున భగవంతునకు నీ ప్రపంచమున నిత్యము జరుగు

చున్న కార్యక్రమమునందుఁ బెత్తనమే యున్న యెడల నిన్ని ఘాతుకకృత్యము లేల జరుగును? వీని నణంచలేఁడా? ఎందులకు నణంచఁడు?

శునశ్శేపుఁడు: ఏమి విచిత్రమైన వాదముఁ జేయుచుంటివి? నీ మాటల కెదురాడువారు లేరనియా? మానవుఁడు కర్మ ప్రేరితుఁడై చేయుచున్న కార్యముల నెవ్వరు మాన్పఁ గలరు?

వేనుఁడు: అయినచో భగవంతుఁడు నిష్ప్రయోజకుండా?

శునశ్శేపుఁడు: మహాపాతకమును మూఁటఁ గట్టుకొనుచు న్నావు.

గౌతముఁడు: నిష్ప్రయోజకుం డెట్లగును? అతఁడు సర్వకర్మ ములకు సాక్షి.

వేనుఁడు: కూటసాక్షియా? ఎందుల కీసాక్షిత్వము? తన కన్నెదుట జరుగుచున్న క్రూరకర్మల మాన్పనేరక సాక్షి యగుచున్నాఁడా? ఏమి చిత్రము! ఈసాక్ష్య మెవ్వరి యెదుట నుపయోగపడును? ఎవ్వరికిఁ బ్రయోజనకారి యగును? విచారణకర్త యెవ్వరు?

గౌతముఁడు: నీవు పాషండుఁడవు; నీకు సుగతులు లేవు.

వేనుఁడు : లేకపోయినఁ బోనిమ్ము. "మాటిమాటికి నీకు సుగతులు లేవు, నరకమునకుఁ బోదువు" అని బెదరింతు వేల ? నీబెదరింపులు దుర్బలహృదయునిఁ గలఁగింపనోపు. నావంటి వానిని గాదు. లోకముఁ గన్నప్పి, మీదుర్వ్యవసాయమునకుఁ దోడ్పడ భగవంతు నొకని సృజించి లేనిపోని సర్వశక్తులు వానికంటఁగట్టి జగమును నుఱ్ఱూఁతలూప యత్నించుచుంటిరి. మీకా సుగతులు, నాకా లేనిది?

గౌతముఁడు : మహాపాతకహేతువులగు నీమాటలు వినఁజాల.

వేనుఁడు : చేయఁగల్గుగుదువుకాని వినలేవు. నిజముగ నీవు సృజించిన భగవంతుఁడు కాఁడా ? నీయవసరము కొలఁది నీ భగవంతుని యవతారము లెత్తించలేదా ? వేషభాషాదులు మార్చలేదా ? ఒకప్పుడు నిరాకారుఁ డంటివి, ఒకప్పుడు సాకారుఁ డంటివి; ఒకప్పుడు భీకరాకారుఁ డంటివి, ఒకప్పుడు వికారుఁ డంటివి; ఒకప్పుడు నరమాంసము, వేఱొకయప్పుడు గోమాంసము; ఇంకొకప్పుడు మృగమాంసము, మఱియొకప్పుడు ఫలపత్రపుష్పాదులు భోజ్య మంటివి. నీ బుద్ధిభ్రమణముతోఁ బాటు భగవంతుని యాకారభాషాభూషావిశేషాదులు మారలేదా ? మాఱుచుండుట లేదా ? ఏల సత్యమును మఱుఁగుపుచ్చెదవు ?

గౌతముఁడు : వేనరాజా ! నీవు నాస్తికుఁడవు. నీతోఁ బ్రసంగమే పాపహేతు వగును. ఈ యాశ్రమము వీడి

హోమ్మ - మగిడి యెన్నండు నీయాశ్రమముగడప దాటి లోనఁ బ్రవేశింపకుము.

వేనుఁడు : నేను నాస్తికుఁడనైన లోకమునకుఁ గల్గు నష్ట మేమి? నే నేమయిన లోకద్రోహముఁ జేయుచుంటినా, లోకపరితారణముఁ జేయుచుంటినా? పరహింసాచరణము నకుఁ గడంగి లోకమును దుఃఖభూయిష్ఠముగాఁ జేయుచుం టినా? నాస్తికతయే పాపహేతు వంటివి. పాప మనఁగా నేమి?

గౌతముఁడు : పాప మనఁగా నేమి! ఇంతవఱకు వచ్చినది. పాప మనఁగా నేమియో యెఱుంగవైతివి. ఇందుచేతనే యింత నిరంకుశపరివర్తనుఁడ వైతివి. ఈప్రజాసౌభాగ్య మిఁక నీచేతం బడి నలిగిపోకుండునా?

వేనుఁడు : గౌతమా! అడిగినదానికి నేల ప్రత్యుత్తర మీ యవు? ఈవిధంబుగనే శిష్యపరంపరకు బోధించుచుంటివా? మేలు మేలు, ధృష్టవర్మా! యగ్నిగుండమును జల్లార్పవైచి తివికదా.

ధృష్టవర్మ : చిత్తము దేవా! శునశ్శేఫునిమాటఁ జెప్ప రెతిరి. యూపంబునకుఁ గట్టివేయుమందురా?

వేనుఁడు : నీప్రశ్నకుఁ బ్రత్యుత్తరము కులపతి చెప్పఁదగినది. ఇఁక నీవైతండికునితోఁ బ్రసంగించి లాభము లేదు. నిదుర పోయినట్టు నటించువానిని మేలుకొల్పుట యెవ్వనికి సాధ్య

మగును! మగిడిపోదము [ఒక పొడలజింకపిల్ల వేనునికాలు రాచుకొనుచుండును. వేనుఁడు చూచి] శునశ్శేఫా! ఎక్క-డిది యీ కృష్ణసార శాబకము? మానవునికిఁ జాల మచ్చిక పడియున్నది. ఎఱుఁగదు మానవునిప్రకృతి.

శునశ్శేఫుఁడు : ఆశ్రమమునఁ బెరుఁగుచున్నది.

వేనుఁడు : ఎందులకుఁ బెంచుచుంటిరి. అహో! మఱచితి, మఱచితి. కృష్ణసారమాంసము ఆర్యఋషులకుఁ జాల రుచ్యముగ నుండునుగాదే. ఇది పోతరించినపిమ్మట భోజనభాజన మగునుగాఁబోలు. కాని దీనిది మొండియాయువు. లేకున్న నాకంటఁ బడదు. ఈ పొడ లెంత మురువుగా నున్నవి. ఇది యెంత ముద్దుఁ గొల్పుచున్నది! ధృష్టవర్మా! నేను దీనిని గొంపోయి సాకెదను. వంటయిల్లు చొచ్చినకుందేలు తప్పించుకొనిపోవుచున్నది. శునశ్శేఫా! యేల యట్లు దిగులుపడి చూచెదవు? ఒక్క-పూట నీ మాంసము లేనంతమాత్రమునసే ప్రాణముమీఁదికి రాదులే.

గౌతముఁడు : ఆర్యఋషులతోడి పరిహాసములు ఆయుఃక్షీణ హేతువులు.

వేనుఁడు : గౌతమా! యెంతకాల మీ బెదరింపులు? కడసారి మాటఁ జెప్పుచుంటిని వినుము. నీ వెఱిఁగి యెఱిఁగి శాసనతిరస్కారముఁ గావించితివి. ఇది ప్రథమతిరస్కార మగుటచే

మందలింపులతో ముగిసినది. ఇట్టిదియే మరల వాటిల్లినచో వేనుఁ డతిప్రచండ శిక్షాప్రదాత యగును. ధర్మపీడ నతఁడు మన్నింపఁడు. ఇంక నే నిం దుండరాదు. ఒక్క హితోపదేశమును జేసిపోయెదను. ఈ చిన్న వటువుల కిప్పటినుండియు మాంసము భుజింప నేర్పవలయునా? నేర్చుకొనవలయు నన్నచోఁ గావలసినంత కాల మున్నది. మాంసమును మాన్పి ప్రపంచమును దుఃఖభూయిష్ఠము గాకుండఁ జేయలేవా? ఆలోచించుకొనుము. నేఁ బోయివచ్చెద. ధృష్టవర్మా! ఈ జింకపిల్లను నీవు తీసికొని బయలుదేరుము, పోదము. [నిష్క్రమింతురు]

మొదటి రంగము

ముగింపు

## రెండవ రంగము

[రాజమాత సునీథాదేవి; గౌతముఁడు.]

గౌతముఁడు : తల్లీ! హృదయము విప్పి చెప్పుచుంటిని. అంగ రాజు మరణము నేటికి మాకుఁ గ్రొంగ్రొత్తదియై దిగులు గొల్పుచున్నది. భావికాలము గాఢాంధకారమయంబై మాకు విషాదభూయిష్ఠంబుగ నున్నట్టు పొడకట్టుచున్నది. ఏమని చెప్పనేర్తును. ప్రశాంతనిలయంబులయిన మాయాశ్రమంబు లల్లకల్లోలమయినవి. పరహింసా పరాఙ్ముఖులయిన పరమతపోధనుల డెందంబులు తల్లడిల్లినవి. ఆశ్రమవాసులా బాలగోపాల మెంత సంక్షోభపడిరో భగవంతుఁ డెఱుఁగు. పరమ పూజ్యుండగు నంగరాజు రాజ్యంబున మా గతు లిట్లయినవి. ఈ దీనుల మొఱ లాలింతు రేమో యని పడుచు లేచుచు నిచ్చటికి వచ్చితిని.

సునీథాదేవి : గౌతమమునీంద్రా! మా వేనుఁడు రాజ్యముఁ జేయుచున్న కాలములోనే యిట్టి దుండగములు వాటిల్లినవా? పరమసాధువులగు మీకే కడగండ్లుటపడినవా? ఏమి దుర్గతి! మా వేనుఁ డెక్కడనున్నాఁడో! ఏమి చేయుచున్నాఁడో! అతఁడు ప్రమత్తుఁడు కాఁడే? కుడిచినచోటఁ బండక పండినచోటఁ గుడువక రాజ్యమెల్లను దీనజనావనార్థమై యెల్ల ప్రొద్దులఁ గుమ్మరుచుండును.

గౌతముఁడు : తల్లీ! కంచెయే చేను మేయుటకుఁ బూను కొన్నది.

సునీథా దేవి : కంచెయే చేను మేయుటకుఁ బూనుకొన్నదా? యేమీ! మా వేనుఁ డాశ్రమవాసులగు ఋషులయెడ నప చారముఁ జేసెనా? చిత్రము. చలిచీమనైనను జావఁద్రొ క్కనేరని మా వేనుఁడు, పై కుఱుకనున్న క్రూరశరారువు నైనను బాణమునఁ గొట్టనొల్లని మా వేనుఁడు, పసితనంబు నుండియు నుగ్గుబాలతో రంగరించి పోసిన భూత దయా రసంబుఁ ద్రావి పెరిగిన మా వేనుఁడు, బీదసాదలఁ దోడు లేనివారలఁ బ్రోవ బద్ధకంకణుండయిన మా వేనుఁడు పర హింసాపరాఙ్ముఖు లయిన ఋషులయెడ నపచారముఁ జేసెనా? ఏలొకో నా మనస్సు నమ్మఁజాలకున్నది. ఎవ్వరో పొరపడియుందురు. ఎచ్చటనో పొరపాటు జరిగి యుండ వలయును.

గౌతముఁడు : మీ కేల యిట్టిసంశయము కలిగెనో తెలియఁ జాలను. మా పురాకృతఫలంబు గాఁబోలు. పొరపా టెం దును, నెవరియందును లేదు. మా యాశ్రమంబులో మొన్న మే మజమేధమును జేయుచుండ నెచ్చటనుండియో పరుగు పరుగున వచ్చి, కులపతులు వలదని బతిమాలుచున్నను, వారిపలుకులు పెడచెవింబెట్టి, పట్టియుంచఁబడిన మేఁకను వదలించి, యజ్ఞగుండమును జల్లార్చివై చెను.

సునీథా దేవి : గౌతమమునీశ్వరా! సర్వమిప్పుడవగతమైనది. ఇదియేనా కంచెయే చేను మేయుట? పట్టియుంపఁబడిన మేఁకను వదలించెను. అగ్నిగుండమును జల్లార్పెను. ఇంతియే. ఆశ్రమవాసులగు తపోధనులజోలికిఁ బోవలేదు కదా! నిజముగ నిది వేనుఁడు చేయుపనియే.

కాదనఁబోఁడు నాయెదుట గట్టిగఁ జెప్పిన కార్య మెన్నఁడున్
వాదము లాడఁబోఁడు బుధవర్గముతో నవుఁగాదటంచు సం
వేదముఁ జూపబోఁడు పరవృత్తి మెఱుంగఁగఁగోరి కాని యా
వైదికధర్మమన్నఁ బొరపాటున నైనను మెచ్చఁ డేమియున్.

మా వేనుఁడు చాలపాపభీతి కలవాఁడు. ఎట్టివానినినైన, నెట్టి సమయంబునందైనఁ జెనకువాఁడు కాఁడు.

గౌతముఁడు : ఎవ్వరో పొరపడియుందు రంటిరి. ఎవ్వరు పొరపడిరో యిప్పుడు మీకు బోధపడుటలేదా? మాయాశ్రమంబుననున్న పరమపూజ్యు లగు తపోధనులతో మహారాజు వితండవాదంబుఁ గావించెను. వారలం గవిసి మాటాడి విసివించెను. తుట్టతుదకుఁ గఠోరస్వరంబున "ఒక్క సమిధ యజ్ఞగుండమునఁ బడెనా యొక్క శిరస్సు మింటి కెగురు" ననిబూకరించి చెప్పి యచ్చట నిలువక డబ్బాటుగా వెడలిపోయెను. తొల్లి మీవంశంబున ఋషులయెడ నింత విశృంఖలముగా సంచరించినవా రెవ్వరైన నుండిరా?

సునీథా దేవి : గౌతమ మునీశ్వరా! మా వేనుని నే నెఱుంగునట్లు లొరు లెవ్వ రెఱుంగరు. ఏయే పరిస్థితులయందు

నాతఁ డెట్లు సంచరించునో నాకు బాగుగాఁ దెలియును. ధర్మపీడ కండ్లారఁ జూచెనా మైమఱచి మాటాడుట యాతని వాజ. చిఱుతనాఁటనుండియు నాతఁ డట్టివాఁడే. ఎవ్వరి స్వభావంబు నెవ్వరు మాన్పఁగలరు? మీా మనస్సులు నొవ్వకుండ నచ్చఁ జెప్పి తనపని దీర్చుకొనరాదా? నొవ్వ నాడుట యేల? మందలించెదను.

గౌతముఁడు : మీారు కూడ నిట్లు చెప్పుచుంటి రేల?

సునీథాదేవి : నే నేమి కానిమాటఁ జెప్పితిని. కొన్ని విషయంబులందు మా వేనుఁడు దృఢాభిప్రాయంబులు కలవాఁడు. ఒకరిమాట వినఁడు.

గౌతముఁడు : నట్టేటఁ బుట్టి మునిఁగినది. యజ్ఞగుండమును జల్లార్పుట, యజ్ఞపశువును దోలివైచుట, యజ్ఞవిఘ్నముఁ గావించుట తప్పులు గావనియేనా మీాతలంపు?

సునీథాదేవి : నాతలంపులతో మీాకుఁ బ్రయోజన మేమి యున్నది? మా వేనుఁ డేమి తలంచెనో యదికదా మీాకుఁ గావలసినది. అతఁడు మోఱకుఁడు, అతనికిఁ బుణ్యపాప జ్ఞాన మున్నది. దోషాదోష విచక్షణ యున్నది. అతఁడు మంచి చెడ్డ లెఱుంగును. కాని ధర్మసంస్థాపనవిషయమున మాత్ర మతండు మోమోటమి యెఱుంగండు. ఇట్టి వానికి నే నేమి బోధింతును?

గౌతముఁడు : ఇప్పుడు ధర్మసంస్థాపనవిషయ మేమి వచ్చి నది ?

సునీథాదేవి : యజ్ఞములు హింసాప్రపూర్ణములు గావున నవి త్యాజ్యము లనియు; నందుచేఁ దనరాజ్యంబున నయ్యవి జరుగఁగూడ దనియు నాతనిపట్టు. దీనికి నే నెటు ప్రతి బంధకముగల్పింపఁగల్గుదును ?

గౌతముఁడు : అయినచో మాకు దిక్కెవ్వరు ? మాయజ్ఞ యాగంబులకుఁ దిలోదకములు వదలవలసిన దేనా? వేన రాజు మొన్న మాయాశ్రమంబునఁ జిన్నపెద్దల తార తమ్యంబు లేక, యద్దుపద్దులు లేక సంచరించెను. శిష్టరక్ష ణముఁ జేయవలసిన రాజే యీవిధంబుగ సంచరింప మా గతి యేమి ?

సునీథాదేవి : శిష్టరక్షణఁ జేయుచుంటి ననియే మావేనుని యభిప్రాయము. హింసామూలకము లయిన యజ్ఞములు, యాగములు, త్యాజ్యములనియు నపరిగ్రాహ్యములనియు, వానిని నాచరించువారు శిష్టులు గారనియు మావేనుని వాదన. నేను జెప్పఁ గలదానినే కాని విన్పింపఁగలనా ?

గౌతముఁడు : అయ్యో ! ఇం కేమి యున్నది ? అగ్గికి గాలి తోడైనట్టు వేనమహారాజునకు నాతని సైన్యాధిపతి ధృష్టవర్మ తోడైనాఁడు. రాజునకుఁ దగినబంటు, కూ్రర

స్వభావుఁడు. మొగమెత్తి మమ్ముఁ జూడకయె యగ్ని గుండమును "నుఫ్" అని యూదివైచెను.

సునీథాదేవి : అట్లయినచో ధృష్టవర్మ తన సేవాధర్మమును జక్కఁగా నెఱవేర్చెను. నమ్మఁదగినబంటే.

గౌతముఁడు : సునీథాదేవి! ఇంక నంగరాజ్యంబునకుఁ దొలంగి మేము వలసపోవలసినదేనా? అంగరాజ్యంబున ఋషులకు నిలువ నీడయే లేదా? తలఁ దాఁచికొనుటకు జేనెడిచోటే లేదా? అరణ్యములయందు వన్యమృగంబులకరణిఁ దిరుగుటకునైన ఋషులు నోఁచుకొనలేదా? ఏనాఁటవచ్చితిమో యిచ్చటకు, నేఁటి కీయిక్కట్టులు వాటిల్లినవి. అతి పూజ్యులును, వయోవృద్ధులునగు కులపతులు నలుగురి కట్టెదుట నవమానింపఁబడిరి. ఇఁక మేము బ్రతికి ప్రయోజనమునకుఁ జేయునది యేమున్నది? రాజాజ్ఞయుండి వైదిక కర్మకాండను దిన్నఁగా జరిపించుటకు మాఱు, వంశపరంపరగా వచ్చుచున్న యజ్ఞములకు విఘ్నమాపాదించుచుండె. మీరట్టి కుమారునిపక్షమై, వాని కుమార్గమును, వాని ధర్మపీడలను సమర్థింపఁ బూనుకొనుచుంటిరి. మీవంటి సాధ్వీమతల్లి కిది చెల్లదు. లోకమంతయు నాగుబ్బగా నేమి చెప్పుకొనుచున్నదో మీరాలకించుటలేదు. వేనరాజాకతాయ గాకున్న మా మునిపల్లెలో నంత గందరగోళము జరుగునా? తల్లీ! దీర్ఘముగ యోజింపుము. ఉభయులకు శ్రేయస్సు కాదు.

సునీథాదేవి : మునీంద్రా! వాగ్ధోరణి మార్చుచుంటిరి. బెదరించి కార్యముఁ జక్కఁబెట్టుకొన యత్నించుచుంటిరా! ఇది తప్పు. దీనివలన మీ కేమియు లాభము లేదు.

గౌతముఁడు : క్షమింపుఁడు. నా కా యుద్దేశము లేదు. మా కష్టనిష్ఠురంబులుచెప్పుకొనుచుంటిమి. మహారాజవలంబించిన నీతిచే మాకు సంభవించుచున్న కష్టగాథలను మీకుఁ దెల్పి మేలు పొందఁగోరు మేము బెదరించుచుంటి మని మీ రేల తలఁపవలయును? ఇట్టిది సమకూడునా?

సునీథాదేవి : ఊరక మా వేనరాజును దూషింపకుము. మీచే దూషింపఁబడఁ దగినవాఁడు కాఁ డతండు. అతనియందు నధర్మముకాని, దౌర్జన్యముకాని యేమయిన నున్న యెడల నన్ను దూషింపుము. దానికి నేనే కారణ మగుదును. అతని మాట యెత్తకుము. అతని ప్రవర్తనకు నేనే యుత్తర వాది నని యెఱుంగుము.

వేనుఁడు : [తెరలో] తల్లీ! క్షమింపుఁడు. మీ రెట్లు లుత్తర వాదు లగుదురు? నేను జేయుచున్న ప్రతికార్యమునకు నేనే యుత్తరవాది నగుదును. [ప్రవేశించి] ఆవేశమున మైమ ఱచితి. ఇదిగో! నమస్కారము గ్రహింపుఁడు.

సునీథాదేవి : కుమారా! దీర్ఘాయుష్మంతుఁడవగుదువుకాక.

వేనుఁడు : ఇందనుక నేమి చెప్పుచుంటిరి? నాకార్యములకు మీ రెటు బాధ్యత వహింతురు? శైశవమునుండి విద్యా

బుద్ధులు గఱపితిరి. సదసద్వివేకము గల్గించితిరి. ధర్మా ధర్మనిరూపణశక్తి యలవఱచితిరి. దోషాదోషవిజ్ఞానము సంఘటించితిరి. అంతవఱకే మీసంబంధము. ఆవల నాకుం దోఁచినరీతి ధర్మసంస్థాపనార్థంబు కొన్ని నూతనమార్గములు ద్రొక్కితిని. ఏతత్కార్యఫలమునకు సంపూర్ణముగా నేనే బాధ్యుఁడను. నాయం దేమయిన మంచియున్న దానికిఁ బ్రతిఫలంబుగా మీకు సద్గతులు గలుగునుగాక. ఇంతకు నేను జేసినయపరాధ మేమి? గౌతమా! యిక్కడ నేదియో తంత్రమును బన్నుచున్నట్లు లున్నది.

గౌతముఁడు : వేనరాజా! ఇంతయావేశముతోడను, ఇంత యాక్రోశముతోడను మాటాడవలసిన యవసర మిప్పు డేమి కల్గినది? నాఁడు మాయజ్ఞగుండమును జల్లార్చి, మాయజ్ఞ విధ్వంస మాచరించితివి. ఆగోడు రాజమాతకు విన్నవించు కొనుటకై వచ్చితిని. దిక్కున్నచోటునకుఁ బోవుట యెల్ల రకు సహజముకదా? దీనికై నీ వింత యుదుటుమాటలు మాటాడ నేల?

వేనుఁడు : రాజమాత రాజకార్యములయందు జోక్యము కలుగఁజేసికొనదని నీ వెఱుంగవా? గృహచ్ఛిద్రములఁ గల్పించి మ మ్మలజడిపాలు సేయుతలంపున · వచ్చితివా? అట్టి దేమియు నిందు జరుగదు.

గౌతముఁడు : ఇది రాజకార్యమా? మతవిధ్వంసము రాజకార్య మందువా? మే మేయిన నీపరిపాలనఁ బ్రతిఘటించుచుంటిమా? నీవు రాజవు కాదని వాదించుచుంటిమా?

వేనుఁడు : గౌతమా! మతవిధ్వంస మని చెప్పి గొంతెత్తి గగ్గోలుపెట్టెద వేల? మతము లేకున్న మానవునకు ముక్తి లేదా? మోక్షము లేదా? నిర్వాణము లేదా? సంసారబంధ విమోచనుండు కాఁజాలఁడా? మతముపేరిట నెంతమంది యొకరి కుత్తుక లొకరు నులిమివైచుకొనుచుండిరి. మతము లే లేకున్న నీ ప్రపంచ మింత బహుళదుఃఖాకీర్ణ ముగా నుండునా? మిథఃకలహములకుఁ బరస్పరమారణములకు మతమే తోడ్పడుచుండుట మన మెఱుంగమా? మతమును నడ్డముగాఁ జేసికొని యజ్ఞ మని యొక్కఁడు, యాగ మని యొక్కఁడు, బలి యని యొక్కఁడు, మ్రొక్కుబడి యని యొక్కఁడు దినదిన మెన్ని వేల సాధుమృగంబుల విశసించుచున్నారు? ఈ దిక్కుమాలిన యజ్ఞపశువుల రోదనధ్వానములను విని విని నిలువున నీరైపోవుచుంటిని. ఒక్కమా రొక్కరోదనము నాచెవులంబడిన నాయొడలు జల్దరించును, పులకరించును. కంటినిండ నిద్దురగాని, కడుపునిండఁ గూడుగాని యెఱుఁగుదునా నేను ? గౌతమా, పదిజీవులను జంపి యొకజీవిని బోషింతు ననుటకంటె నొక్కజీవిని జంపి పది జీవులను బోషింతు ననుట యుత్తమము కాదా ?

గౌతముఁడు : వేనరాజా! ఈ వెఱ్ఱివేదాంత మేమి? ఈ ప్రపంచ మంతయు బహుళహింసాప్రపూర్ణము. నీమాటలు సృష్టివిరుద్ధములు.

ప్రాణిహింస నీవు పనికిరా దందువే
హింసఁ జేయకుండ, నెవఁడు బ్రతుకు?
జీవరాసు లెల్ల జీవించుచుండవే
జగతి నొండొరులను జంపి తినుచు.

ఈఁగను గప్ప, కప్పను బాము, పామును నెమలి, నెమలిని వేటకాఁడు నిరంతరము చంపి తిని జీవించుచుండుట లేదా? ఈవిధమున నన్యోన్యభక్షణమునఁ బ్రపంచము వర్ధిల్లుచుండ నీ వేమియో కుతర్కముచేఁ గార్యమును సాధింపఁజూచుచున్నావు. ఈ నీయత్న మేఁటి కెదు రీదుట కాదా?

వేనుఁడు : సృష్టిస్వభావ మని చెప్పి, చతుష్పాదజంతుకోటి ప్రవర్తనమే మానవునకు మేలుబంతిగా నిరూపింపఁబూనుట ధర్మమా? గౌతమా! నీవాదమే సమంజస మగునెడల దీని కేమి సమాధానముఁ జెప్పెదవు?

అంగదను దూలు తోఁడేళ్ళు, నలమటించు
తిమితిమింగిలమ్ములు స్వజాతి దిగమ్రింగు
ఇదియె నైసర్గిక మటంచు నెంచి నరులు
చంపి తినవచ్చునొకో స్వజాతిజనుల.
పోతు పెంటి యనెడి పార పాక్కటియె చతు

ష్పాదజంతువులకు, వావి లేదు;
నరుఁడుకూడ నిదియె నైసర్గిక మటంచు
నడచుకొనుట యెటు న్యాయమగును?

గౌతమా! నీవాదమును సంపూర్ణముగ నంగీకరించిన యెడల నెట్టివిపరీతము -లుద్భవించునో పరికించుము. మానవులు క్రమముగా జంతుసంతానములోఁ జేరిపోదురు. చదివితివి, చదివించితివి. కాని చదువుచే నీ చిత్తప్రవృత్తి యేమియు మారినట్లు గన్పట్టదు.

జంతువులకు మానవులకు సరిసమాన
ములగు నాహారనిద్రాభయాదు లెందు
మానవున కధికంబు విజ్ఞాన మొకటి
యందుచేతనే తారతమ్యంబు కలుగు.

గౌతముఁడు : మహారాజా! నీవు చెప్పునది నిజమే యని భావింతము. మానవునకు విజ్ఞానధన మున్నది. పశుపక్షి క్రిమికీటకాదులు భగవంతుని ధ్యానింపలేవు; పూజింపలేవు; బహువిధంబుల సంప్రీతుని జేయలేవు. మానవుఁ డొక్కఁడే వీనిని జేయ సమర్థుఁడు. భగవంతునికొఱకుఁ జేయుచున్న కార్యములను దుష్టము లదుష్టము లని నీవేల నిర్ణయింతువు? అట్లు చేయుటకు నీ కధికార మెక్కడిది?

వేనుఁడు : రాజున కధికారమే లేదా? నారాజ్యములో నున్న ప్రజలసౌభాగ్యమును వర్ధిల్లఁజేయుట నా ధర్మముకాదా?

పాపకార్యములు భగవంతునిపేరిటఁ జేసిన మాత్రానఁ బుణ్యకార్యము లగునా? ఇతరజంతువులను బలిగాఁజేసి భగవంతునిఁ బ్రీతునిగాఁ జేసెదనని చెప్పుటకన్న నాత్మార్పణముఁజేసి కృతకృత్యుఁడవు కారాదా? ఇదియే నీవుచేసిన యెడల మా కీ గొడవ యంతయుఁ దప్పునుగదా? జంతుముఖంబున భగవంతునిఁ బ్రీతుని చేతుననుట విజ్ఞానము కల్గు మానవుఁడు చేయదగిన దేనా? కాన నీ యజ్ఞయాగములు కట్టిపెట్టి పరార్థచింతకుఁడవు కమ్మా.

గౌతముఁడు : ఎంతకాలము చెప్పినను యజ్ఞయాగములు కట్టిపెట్టు మన్నమాటయే కాని యొండు చెప్పనొల్లవు. నీవాదము వినుచున్నకొలఁది మేము కన్నీటితో నంగరాజ్యంబునకుఁ దిలోదకంబు లర్పించి పరసీమలకుఁ బోవలసివచ్చినట్లున్నది. తరతరంబులనుండి నిరంతరాయముగఁ దపము, జపము, దానము, ధర్మము, యజ్ఞము, యాగముఁ జేసికొనుచుఁ గాయగసరులతోఁ గడుపుచి చ్చార్చుకొనుచు, నడవులయందు మునిపల్లెల నివసించుచుంటిమి. ఈ జీవనము మా కిఁక దుర్లభమా?

వేనుఁడు : గౌతమా! ఒక్క-ప్రాణిహింస వల దంటినిగాని, మీ ప్రశాంతజీవనమునకు నే నేమి యవరోధముఁ గల్పించితిని. జపము వలదంటినా? తపము వలదంటినా? మీవిజ్ఞానధనమును వెదఁజల్లి లోకమెల్ల నిత్యకల్యాణము, పచ్చతోరణముగాఁ జేసి మీ రానందిం

చుఁడు; మ మ్మానందపఱచుఁడు. ఈ ప్రాణిహింసకు సుముఖుఁడ నగుటకు నెన్ని మాఱులో ప్రయత్నించితిని. నా కయితికాదయ్యె. ఒక్క యాక్రందనము వింటినా నా గుండె లవిసిపోవును. నే వినఁజాల. నాప్రకృతి యిది. తుది మాటఁ జెప్పుచుంటిని. లోకము నాయాజ్ఞాబద్ధమై యా నందమయమైనను గావలయును, లేకున్న నే నీలోకమును బాసినైనను బోవలయును. నాకు వేఱొండు తెఱవు లేదు.

సునీథాదేవి : కుమారా! అశ్లీలములు వచించుచు న్నావు.

వేనుఁడు : తల్లీ! మీ రెఱుంగనిది లేదు. "స్వధర్మే నిధనం శ్రేయః" అను నభియుక్తి పాటింపఁదగినది కాదా? ఎఱిఁగి యెఱిఁగియే యొక్కొక్కయడుగు ముందునకు వైచుచుంటిని.

సునీథాదేవి : నేఁడు గాకపోయిన, ఱే పయినను నీమనో రథము నెఱవేరకమానదు.

వేనుఁడు : మీ యాశీఃప్రభావ మనంతము. ఈ వ్యర్థవా దముతో నగు పని లేదు. సెలవిప్పింపుఁడు; పోయివచ్చెద.

సునీథాదేవి : కుమారా! అప్రమత్తుండవై చరింపుము.

వేనుఁడు : చి తము. [నిష్క్రమించును]

గౌతముఁడు : నా కేమి సెలవిత్తురు ?

సునీథాదేవి : వింటివికదా మహారాజునిశ్చితాభిప్రాయ-
ములు. ఇఁక నేఁజేయునది యే మున్నది ?

గౌతముఁడు : అయినచో దిక్కులేనివానికి దేవుఁడే దిక్కు.
నాకు సెలవా ? పోయివచ్చెదను. [నిష్క్రమించుచు]
"లోకము నాయాజ్ఞాబద్ధమై యానందమయమైనను గావల-
యును" - నిజము ! నిజము ! మహారాజువాక్యములే మాకు-
దారిచూపుచున్నవి. ఇందు మొదటిది జరుగరాదు.
రెండవది జరిగి తీరవలయును. కానిచో మాకు భవితవ్య-
మే లేదు. అగునగు; సేనాపతి ధృష్టవర్మ యతిమూర్ఖుఁడు.
కాని యత్యంతసాహసి; ముందుచూపుగాని ప్రక్కచూపు-
లేదు.

రెండవరంగము

ముగింపు

## మూడవరంగము

[శునశ్శేఫుఁడు బైరాగివేషమునఁ జితారుమీటుచు, రాజవీథులయందుఁ దిరుగాడుచు.]

పుట్టిపుట్టకముందె విప్రుఁడు, పూజనీయుం డౌఁగదే
విప్రబాలుఁడు మాన్యుఁడౌఁగద వృద్ధుకంటెను దమ్ముఁడా!
శఠుఁడుసైతము విప్రుఁడౌనెడ, సర్వపూజ్యుం డౌఁగదే
తెలిసితెలియనివారిమాటలఁ జెవినిఁ జేర్పకు దమ్ముఁడా!
కులములన్నిఁటిలోను వినరా బ్రహ్మకులమే కులమురా!
బ్రహ్మకులమును మించినట్టిది పాఱఁజూచిన లేదురా!
"బ్రాహ్మణో మమ దేవతా"యని పరమపురుషుఁడు చెప్పఁడే?
బ్రాహ్మణోత్తమసేవఁజేసిన, బ్రహ్మపదమే వచ్చురా!

[ధృష్టవర్మప్రవేశము.]

ధృష్టవర్మ: ఏమి యీ చిత్రము! మా మహారాజు రేయనక పగలనక, వానయనక వంగుళ్లనక, దేశమెల్లఁ గ్రుమ్మరుచు బీదసాదలజాలిపాట లాలించి, లాలించి, పాలించుచున్నను బ్రాకృతజనంబునకు విశ్వాసము కుదురకున్నది. ప్రజలు నివురుగప్పిన నిప్పువలె నున్నారు. ఏవేళ బగ్గుమని మండిపడుదురో! నేనెంత జాగరూకుఁడనై నచ్చునట్లు రాజశాసనముఁ బ్రజలకు బోధించుచున్నను వినువారే

లేరు. దినదినము విరోధులసంఖ్య హెచ్చుచున్నది. ఋషు లెన్ని కపటోపాయములఁ బ్రజల రెచ్చఁగొట్టుచున్నారు! ఎప్పుడో నాప్రాణ మీమూఢుల చేతులలోఁ జిక్కక మానదు. కానీ చూతము.

శునశ్శేఫుఁడు :

లోకమంతయుఁ జిమ్మచీఁకటి జిమ్ముచుండెను మేలుకో!
లోటుపాటులు దెలియకుండిరి లోకపాలురు తమ్ముఁడా!
వర్ణధర్మము రాజధర్మము వక్రమార్గముఁ దొక్కఁగా
పాపపంకిలు లగుచునుండిరి ప్రజలు నేఁటికిఁ దమ్ముఁడా!

ధృష్టవర్మ : ఏమి యీ పాట; ఎవ్వఁడో వీఁడు భీకరశాసనుం డగు వేనునిశాసనంబుఁగూడఁ దిరస్కరించుచున్నాఁడే!

శునశ్శేఫుఁడు:

వర్ణధర్మము కూలిపోయెను, వేదధర్మము కాలిపోయెను
రాజధర్మము వ్రీలిపోయెను, రాజు రైతును నొక్కటేనట!
కానికాలము వచ్చె నేఁటికిఁ, గర్మమిట్టులఁ బండిపోయెను
బ్రాహ్మణుండును నవరవర్ణుఁడు, ప్రాఁతచుట్టము లైరి తమ్ముఁడ!

ధృష్టవర్మ : ఓయి, యెవ్వరవు నీవు ?

శునశ్శేఫుఁడు :

బ్రహ్మముఖముననుండి వచ్చెను
భరతవర్షం బంత చొచ్చెను

పరమపూజ్యాం డయ్యె నేఁటికి
భావికాలం బెటుల నుండునో !

ధృష్టవర్మ : ఓయీ, ఎవ్వరవు నీవు ? పిలిచినఁ బలుకక పాడుచున్నావు. వేనరాజ్యంబున నీపాటలు పాడుటేమి ? ఈపాటలు పాడుచున్న నీతల యీపాటికే యెగిరిపోవలసి యున్నది.

శునశ్శేపుఁడు : ఎచ్చటకు స్వామి ?

ధృష్టవర్మ : ఉప్పరవీథికి.

శునశ్శేపుఁడు : నే నా వీథికిఁ బోనొల్లను. నే నీ వీథిలోనుండి యే ముష్టి యెత్తుకొందును. వేనరాజ్యంబులోనిచిత్రములఁ గందును. ఉప్పరవీథికి నెందులకు?

ధృష్టవర్మ : వేనరాజ్యంబునందలిచిత్రంబులఁ గందువుగాని, వేనరాజ్యంబులో నీ పాఁతపాటలు పాడుచోఁ గోఁతనో కొఱుతనో పడుదువు.

శునశ్శేపుఁడు : పాఁతపాటలుపాడువారి నందఱను గోఁతనో, కొఱుతనో వేయించుటేనా ? ఇ దెక్కడిరాజ్యము ? ఇ దెక్కడిధర్మము ? కారణ మేమయినఁ జెప్పెదరా ? అది యుఁగూడ లేదా ?

ధృష్టవర్మ : కారణములఁ జెప్పటేమి ? ప్రాఁతపాటలు న్యా

నాధిక్యతలు బోధించి సౌభ్రాతృత్వముఁ జెడఁగొట్టి యసంతృప్తి కల్గించుననియు, హింసాప్రబోధకంబులనియు, భూతదయావిధ్వంసకములనియు మామహారాజునభిప్రాయము. అట్టి తారతమ్యంబుల నుద్దేశించు పదములు, పాటలు తన రాజ్యంబున నడుగుపెట్టనీయ నని శపథంబుఁ బట్టినాఁడు. ఈ శాసనం బప్రతిహతంబు.

శునశ్శేఫుఁడు : పాటలు పాడినందులకే యింతక్రూరదండనమా ? ఈపాటలు మాతాత మాతండ్రికి నేర్పెను. మాతండ్రి నాకు నేర్పెను. పుడిసిలిగంజికై యీ పాఁతపాటలు పాడుకొంచు దేశమెల్లం దిరుగుచుందును. నాల్గునాళ్ళకై మరలఁ గ్రొత్తపాటల నెక్కడ నేర్చికోఁగల్గుదును. నడివయస్సు దాఁటినది. రేపో మాపో; దీని కింత యారాటమేల ?

తనువు సత్యముగాదురో రన్నా
ధర్మమొక్కటే నిత్యమో రన్నా
తనువు శాశ్వత మనుచు లోనమ్మి
తప్పుదారులఁ ద్రొక్కబోకన్నా

ధృష్టవర్మ : నే నడుగుచున్నది యొక్కటి, నీవు చెప్పుచున్నది మరియొక్కటి. పదములు పాటలతోఁగాని జవాబు చెప్పలేవా ? సరియైన జవాబు చెప్పింపవలయునా ?

శునశ్శేఫుఁడు : అంత కోపపడియెద రేల ? అలవాటుచే

బాటలు తమంత తామే నోర్వెడలి వచ్చుచున్నవి. మీకుఁ గావలసిన సమాచార మేదియో యడుగుడు, చెప్పెదను.

ధృష్టవర్మ: మీ దేయూరు?

శునశ్శేఫుఁడు: మాది యుత్తరాది.

ధృష్టవర్మ: ఇంతలోనే యబద్ధముఁ జెప్పుచున్నావా? నేను వినలే దనుకొంటివా, నీవు పాడుచున్న పాటను?

శునశ్శేఫుఁడు: పెద్దచిక్కే వచ్చినది. మాది బ్రహ్మ ముఖము. ఉత్తరాది యన్నను బ్రహ్మముఖ మన్నను నొక్కటే.

ధృష్టవర్మ - అది యెచ్చట నున్నది?

శునశ్శేఫుఁడు: బ్రహ్మకపాలముదిగువ నానుకొని యున్నది.

ధృష్టవర్మ: అందలివిశేషము లేమి?

శునశ్శేఫుఁడు: పేరుకొని పేరుకొనని గంగోదకము శింఘాణమువలె బ్రహ్మముఖమును వెలువడి వచ్చుచుండును.

ధృష్టవర్మ: చిత్రము. నీ వీ పట్టణంబునకు వచ్చి యెన్ని నాళ్లయినది?

శునశ్శేఫుఁడు : రెండు మూడు వారము లయినది.

ధృష్టవర్మ : ఇన్నాళ్లెచ్చట నుంటివి ?

శునశ్శేఫుఁడు : ఈప్రాంతమున్న మునిపల్లెలో. పగలెల్ల నడిగి కొని తెచ్చిన యన్నకబళమును గుడిచి రాత్రిపూట మునుల సేవఁ జేయుచుఁ గాలక్షేపముఁ జేయుచుందును.

ధృష్టవర్మ : ఓహో! యీపాటలకుఁ గారణ మిదియా ? ఈపాటలు మీతాతదగ్గరనుండి తండ్రికి, దండ్రిదగ్గర నుండి నీకు వచ్చెనంటి వేమోయి? ఒక తప్పును గప్పిపుచ్చ రెండవదియా ? అబద్ధ మేల యాడెదవు ?

శునశ్శేఫుఁడు : స్వామీ ! యిట్లనుచుంటి రేమి ? నా కబద్ధ మాడుట చేతకాదు. నేను జెప్పిన దంతయు సత్యమే.

ధృష్టవర్మ : మునిపల్లె మహారాజునకుఁ బ్రతికూలమని యెఱుంగవా ? మునిపల్లెలో నున్న మునిముచ్చు లందఱు మహారాజునకు వ్యతిరేకులే. కలహశీలురైన యా మునుల చేతనే పట్టణ మింత యలజడి పొందుచున్నది. మహారాజును దలక్రిందు చేయవలయు నని వారు పన్నుచున్న పన్నుగడలు, వారు చేయుచున్న కుట్రలిన్నిన్నని చెప్పనగునా. వారు చేయుచున్న శాసనధిక్కారమున కంతున్నదా?

శునశ్శేఫుఁడు : ఒట్టుపెట్టుకొని చెప్పుచున్నాను. నాకీగొడవ

యేమియుఁ దెలియదు. ఎఱిఁగి యెఱిఁగి యగ్నిగుండమున దూఁకెదనా ?

ధృష్టవర్మ : ఋషులు కానిచో నీ కిట్టిపాటలు నేర్పనెవ్వరు సాహసింతురు ?

శునశ్శేఫుఁడు : గట్టిగఁ జెప్పుచుంటిని. ఋషులు నా కీపాటలు నేర్పలేదు.

ధృష్టవర్మ : నేను నమ్మను. ఋషు లీ పాటలు నీకు నేర్పి పట్టణంబులోఁ బాడుట కంపియుందురు. ఏమి జరుగునో చూతమని వారి యూహ. ధృష్టవర్మ ప్రాణములతో నున్నంతకాలము రాజశాసన తిరస్కృతి, ప్రాణప్రయాణ మొకట్రమాటే జరుగును.

శునశ్శేఫుఁడు : బాబూ ! ఎవ్వరా ధృష్టవర్మ ?

ధృష్టవర్మ : వేనమహారాజుసర్వసైన్యాధిపతియుఁ దదాంతరంగికుండును.

శునశ్శేఫుఁడు : వా రెచ్చట నుందురు ?

ధృష్టవర్మ : ఈపట్టణంబున నెచ్చటఁ జూచినను వారే యుందురు.

శునశ్శేఫుఁడు : ఏరీ యిచ్చట ?

ధృష్టవర్మ : నీతో మాటాడుచున్నవారే.

శునశ్శేఫుఁడు : హతోఽస్మి, హతోఽస్మి. ఎఱుంగక యింత ప్రసంగముఁ జేసితిని. ఇఁక నే నీపాటలు పాడను. ముని పల్లెగడపవైనను ద్రొక్కను. కాని ఋషు లెంత దొంగలు, నాకుఁ జెప్పఁగూడదా ఈపాటలు పాడినఁ బ్రాణము పోవునని! స్వామీ! మీరు నాతో మునిపల్లె రండు. ఎందుల కింత మోసపుచ్చిరో మునులను గనుఁగొందము.

ధృష్టవర్మ : [తటపటాయించి] సరే, నడువుము. వారేమి చెప్పెదరో చూచెదను. వారియింగితముకూడఁ దెలిసి కొందును.

శునశ్శేఫుఁడు : మీ రటకు వత్తుననుటచేఁ గృతార్థుఁడనైతిని. నానిజము మీరు తెలిసికొనవచ్చును. కాని మునుల కీగొడవయెందులకు? పగఁబట్టి రాజును సాధింతురా? రాజు కన్నుఁ దెఱచిన మలమల మాడిపోదురే.

ధృష్టవర్మ : రాజు కన్ను దెఱచువాఁడు కాకపోవుటచేతనే ఋషులయాటలు సాగుచున్నవి. దీనికిఁ దగినట్టు కాలము తలక్రిం దగుచున్నది. క్రొత్తప్రాంత పోరాటములోఁ బ్రజలు నలిగి చచ్చిపోవుచున్నారు.

శునశ్శేఫుఁడు : మెత్తనిరాజును జూచిన నెవ్వరు భయపడు

దురు? ఎవ్వరు మన్నింతురు? ఎవ్వరు శాసనబద్ధు లగుదురు?

ధృష్టవర్మ: ఇప్పు డీ రాజ్యంబునఁ దటస్థించుచున్న దింతియే. పోదము పద. [నిష్క్రమింతురు]

[మునిపల్లె; గౌతముని కుటీరము; ధృష్టవర్మ శునశ్శేఫులు ప్రవేశింతురు.]

శునశ్శేఫుఁడు: స్వామీ! ఆ కనఁబడుచున్న దే గౌతముల వారికుటీరము. గౌతము లీ మునిపల్లెకుఁ గులపతులు. చాలఁ బెద్దలు. అన్నిశాస్త్రములు కూలంకషముగా నధ్యయనముఁజేసిన పండితులు. వారు దర్శనముఁ జేయఁదగిన వారు. అచ్చటకుఁ బోదము రండు.

గౌతములవారిని మును పొకయప్పుడు చూచి యుంటిని. నాకు వైతండికులుగాఁ గన్పట్టినారు.

శునశ్శేఫుఁడు: అ ట్లనఁజనదు. గొప్పతార్కికులు. వారివాద మద్భుతంబుగా నుండును. ఎట్టివారినైన సుముఖులుగాఁ జేసికొనఁగల్గుదురు.

ధృష్టవర్మ: ప్రాయశః మామహారాజునిదర్క.

శునశ్శేఫుఁడు: ప్రతిపక్షు లగుటచే నొకరివాదము నొకరు వినసే వినరు గాఁబోలు.

ధృష్టవర్మ : విన్నను నొకరిమాట యొకరికి నచ్చదు. ఇప్పు డీవాదము మన కేల? పోదము పద.

గౌతముఁడు : ఓయీ! యెవ్వరినో కొనివచ్చుచుంటివి. [పరికించి] ఓహో! దండనాథులా! దయచేయుఁ డీ దర్భాసనముమీఁద. అతిథిపూజకు మాకింతకన్న నుత్తమ మగు నాసనములు లేవు.

ధృష్టవర్మ : మునీంద్రా! యివియే యుత్తమమయిన యాసనములు. సుఖముగఁ గూర్చుండవచ్చును. ఈ వృక్షము చలిపందిరివలె నున్నది. ఆశ్రమ మెంత ప్రశాంతముగ నున్నది!

గౌతముఁడు : ఆశ్రమ మెంత ప్రశాంతముగ నున్నను,మా మనస్సులు మాత్ర మల్లకల్లోలముగ నున్నవి. దట్టమగు నీ చెట్లనీడ వేదాధ్యయనముఁ జేసికొను వారికి కూడ నిఁక ముం దున్నట్లు తోఁచుటలేదు.

ధృష్టవర్మ : కలిమిలేములు, సుఖదుఃఖములు కావడికుండలు. మీకుఁ దెలియని దేమున్నది?

శునశ్శేఫుడు : దేవా! మొన్న మీముందుఁ బాడిన పాట రాజద్వేషము పురిగొల్పుననియు, నాతలఁ దెగవ్రేసెదనని యు నన్ను వీరు పదరఁగా నేమియుఁదోఁచక, బతిమాలి వీరి

నిటకుఁ దో డ్తెచ్చితిని. అట్టిపాటను బాడఁగూడదని నా కేల బోధింపరైతిరి. నిజముగ నాతలయే యెగిరిపోయిన నీపాటికి నే నెక్కడ నుండువాఁడను?

గౌతముఁడు : ఓయీ! నీవు పాడుచున్న యీపాట యట్టిదియైనయెడల నీ కేల బోధింపము? రాజద్వేషము మా కేల? "నా విష్ణుః పృథివీపతి" యను నార్యోక్తి మే మెఱుంగమా?

ధృష్టవర్మ : మీ రెఱుంగనిది యేమున్నది? కాని విపరీతార్థములు, అంతరార్థము లవసరముకొలంది చెప్పి యేదియైన సమర్థించి, సరిపుచ్చెద రని భయంబు.

గౌతముఁడు : ధృష్టవర్మా! అట్టి భయంబు నీ కుండఁదగదు. మాకుఁ బాపభీతిగలదు. దైవభీతిగలదు. పాపమూలకంబులగు పను లేల బోధింతుము?

ధృష్టవర్మ : కాని దృక్పథము భేదించినపుడు మీ దేవునకు, మా దేవునకు మీపాపమునకు, మాపాపమునకుఁగూడ భేదముత్పన్నము కాగూడదా?

గౌతముఁడు : దృక్పథమున భేద మెట్లు తటస్థించును. మనమందఱ మొక్క ధర్మమునే యవలంబించి, వర్తించుచుంటిమి గదా!

ధృష్టవర్మ: ఒక్కధర్మమునే యవలంబించుచున్నను, భిన్న మనఃప్రవృత్తులచే నొక్కధర్మమే భిన్నరూపములను బొందుట లేదా ?

గౌతముఁడు: ఈ దుర్వాదమేల? మన సనాతనధర్మమునకు వేదము మూలము; వైదికధర్మముల నవలంబించుచున్న మనకుఁ బరస్పరవిరుద్ధము లయిన ధర్మము లేల పొసంగును ?

ధృష్టవర్మ: వేదములందు మాత్రము పరస్పర విరుద్ధము లుండఁగూడదా ?

గౌతముఁడు: ఎట్లుండును ? వేదము భగవద్దత్తము.

ధృష్టవర్మ: "భగవద్దత్తము" అనఁగా?

గౌతముఁడు: లోకకల్యాణార్థమై భగవంతుఁడు వేదములను తొల్లి మహర్షులకు నొసంగెను.

ధృష్టవర్మ: తొల్లి యనఁగా.

గౌతముఁడు: సృష్ట్యాదియందు.

ధృష్టవర్మ: సృష్ట్యాదియందు కొందరు ఋషు లుండిరనియు, నాఋషులకు భగవంతుఁడు బోధించెననియు మీరు చెప్పు

చున్నారు. వేదములే లేనికాలమున ఋషులెట్లువచ్చిరి? ఇది మీ కెట్లు తెలిసినది?

గౌతముఁడు : వేదములయందే యీ విషయంబు లన్నియుఁ జెప్పఁబడ్డవి.

ధృష్టవర్మ : వేదములు తా మెట్లుపుట్టెనో, తా మెట్టు ఋషుల వదనగహ్వరముఁజొచ్చెనో చెప్పుకొన్నవి. చక్కని కథ! పిల్లలునమ్ముటకు, పోనిండు. మీరు చెప్పఁదలంచుకొన్న ది చెప్పుడు.

గౌతముఁడు : వంశపరంపరగ మాయధీనములును, భగవద్దత్తములునునైన వేదములచేఁ బ్రతిపాదింపఁబడిన ధర్మములను బ్రచారముఁజేయుటకు సర్వదా ప్రయత్నింతుము.

ధృష్టవర్మ : ఇది యెల్లరు చేయఁదగిన కార్యమే యను కొందును.

గౌతముఁడు : ఎల్లరు చేయఁదగిన కార్యమే కాని, భగవంతుఁడు వేదప్రోక్తధర్మములను బ్రతిష్ఠించుటకు రాజులను సృష్టించి సర్వాధికారంబు వారిహస్తగతముఁ జేసెను.

ధృష్టవర్మ : ఇది యొక పెద్దచిక్కు తెచ్చిపెట్టితిరే. మావంటి వారా ప్రచారమునకుఁ బూనుకొనరాదా?

గౌతముఁడు : సామాన్యజనుల కీ యధికారంబులేదు. రాజుల కే యీయధికారంబు కైవసంబు చేయఁబడినది. వారు తమవిధిని దిన్నఁగా నిర్వహింపకున్న వారి కుపదేశించియో, వారిని శాసించియో, వైదికధర్మమును బ్రతిష్ఠింపఁ జేయవలసినది వైదికులు.

ధృష్టవర్మ : రాజులకు, బ్రాహ్మణులకుఁ దక్క మతప్రచారమున నితరు లెవ్వరికి నధికారము లేదందురు, సరియె! ఈ వేదప్రతిపాదితధర్మము లెవ్వరిచేఁ దెలియందగినవి ?

గౌతముఁడు : మహర్షులచే. నిరంతర భగవద్ధ్యానశీలురగు సంయములు మనఃకాయక్లేశములకు సరకుసేయక గురుకులవాసముఁజేసి, త్రికాలవేదులగు పెద్దలకడ విద్యల నభ్యసించి, వేదముల నామూలాగ్రముగఁ బారాయణఁ జేసి, తద్ధర్మముల నవగాహముఁ జేసికొని లోకకల్యాణార్థము, శిష్యపరంపరమూలమునఁ బ్రపంచమున కెఱిఁగింతురు. ఎప్పుడయిన ధర్మవిప్లవము తటస్థించిన రాజట్టి యుపద్రవముఁ దొలఁగించి పరిపాలనఁ జేయవలయు.

ధృష్టవర్మ : రాజట్టిధర్మపీడలను దొలఁగింపకున్నయెడల?

గౌతముఁడు : రాజు దండ్యుఁడగును.

ధృష్టవర్మ : ఎవరు రాజును దండించునది?.

గౌతముఁడు : ఈలోకమున బ్రాహ్మణులు, పరలోకమున భగవంతుఁడు.

ధృష్టవర్మ : రెండు శిక్షలేటికి ?

గౌతముఁడు : ఒకటి తప్పించుకొన్న రెండవది.

ధృష్టవర్మ : చచ్చినను దప్పిపోదా ?

గౌతముఁడు : పోదు.

ధృష్టవర్మ : బ్రాహ్మణులు ప్రమత్తులై యూరకున్నచో ?

గౌతముఁడు : వారును దండ్యులే యగుదురు. అందుచేతనే వేనమహారాజు వైదికధర్మములకుఁ బ్రతికూలుఁ డగుటచే వానిని నిలువఁబెట్టఁ బ్రయత్నించుచుంటిమి. రాజభక్తియు దైవభక్తియుఁ బ్రేరేపఁగా నీకార్యమునకుఁ బూనుకొంటిమి. దానికి మహారాజు కుద్ధుఁడై యేమేమియో చేయుచున్నాఁడు. ఇంతియే కాదు. ధర్మపీడలను వారింపక రాజు వానికిఁ దోడ్పడుచుండిన హంతవ్యుఁ డగును.

ధృష్టవర్మ : హంతవ్యుఁడా? ఇది వినరానిమాట; రాజు హంతవ్యుఁడా! ఇది నాముందు చెప్పఁగూడని మాట.

గౌతముఁడు : వినరానిదైనను, వినిపించవలసి వచ్చినందులకుఁ జింతించుచుంటిని. ధర్మనిర్ణయముఁ జేయునప్పుడు

గాని, ధర్మబోధఁ జేయునప్పుడుగాని, మోమోటమి చెల్ల దని పెద్దలు చెప్పుదురు. ఇట్టిరాజునకుఁ దోడ్పడువారు సైతము హంతవ్యులనియే వేదములు ఘోషించుచున్నవి.

[illegible] నారాజునకయి ప్రాణములు గోల్పోవుటకు నే నేమాత్రము సంకోచింపను. కాని మానీశ్వరా! ఒక్క విషయ మడుగుచుంటిని. మా వేనమహారా జాచరించు చున్న ధర్మములు వేదవిరుద్ధము లేనా?

గౌతముఁడు : వేదవిరుద్ధములే కాదు, నిస్సంశయముగా వేద నిషిద్ధములు. వేదములు నెత్తిని నోరుఁబెట్టుకొని వలదని ఘోషించుచున్నను వేనరాజు వినకున్నాఁడు. వేదములు విధించుటచేతనే మేము యజ్ఞములు యాగములు చేయుచున్నాము. వేనరాజు నిషేధించినాఁడు; మేము నిస్సహాయులమై యూరకుంటిమి.

ధృష్టవర్మ : జీవహింస వేదసమ్మతమేనా?

గౌతముఁడు : యజ్ఞములయందుఁ జేయఁబడుహింస హింస కాదని వేదములు నుడువుచున్నవి.

ధృష్టవర్మ : ఇది యెట్లు?

గౌతముఁడు : యజ్ఞములు జగదవనార్థము సృజింపఁబడినవి కాన.

ధృష్టవర్మ : అట్లయినచో మా వేనరాజు భ్రమప్రమాదము లలోఁ బడినవాఁ డన్నమాటే. మీరు మా మహారాజునకు బోధించి చూడఁగూడదా ?

గౌతముఁడు : లాభ మేమి యుండు ? నీ వెఱుంగుదువుకదా నాఁటిసంగతి! వేదములు బోధించుచున్నను, పరిగ్రాహ్య ములు కావని మహారాజు వారించుచున్నాఁడు.

ధృష్టవర్మ : అట్లయినచో భగవదపచారముఁ గావించు చున్నాఁడే.

గౌతముఁడు : ఇందులకు సందియమేల ?

ధృష్టవర్మ : అయ్యో! పరార్థజీవనుఁడే యాతఁడు, ఎన్నఁ డయిన స్వార్థ మభిలషించి యేకార్యమయినఁ జేసెనా ? ప్రపంచమంతయు దుఃఖమయము. ఆదుఃఖమును దొలఁగించి తీరుదు నని పాటుబడుచున్నాఁడే.

గౌతముఁడు : మానవమాత్రున కిది సాధ్యపడునా ? అడి యాసలు, అడిగొట్టుతనము. అందునను భగవత్ప్రతిపాదిత ధర్మములనే తృణీకరించి యసాధ్యములను సాధింపఁబూను ట మహాసాహసము. యజ్ఞయాగములు వలదన్నఁ బ్రజ లలో నెంత కలవరము గల్గుచున్నదో విచారించికొనుము.

ధృష్టవర్మ : ప్రజలలోఁ గలవరమును నేను బాగుగ గుర్తిం చితిని. ఎచ్చటఁ జూచినను విరోధులే.

గౌతముఁడు : మహారాజు తన విపరీత ధర్మప్రచారముచే రాజ్యమునెల్ల నల్లకల్లోలముఁజేసి, శాంతిలేకుండఁజేయుచున్నాఁడు. మావంటిపరార్థజీవనులఁ దృణీకరించుచున్నాఁడు. ప్రజలు చెలరేగి విప్లవకారులై రాజవంశమునకే ముప్పు గల్గింతురని వేదనపడుచున్నాను. అంగరాజు పేరు దలంచుకొన్నయప్పుడెల్ల నిర్విణ్ణుఁడ నగుచున్నాను.

ధృష్టవర్మ : ఈ వాక్యములు నన్నుఁ గలఁతపెట్టుచున్నవి. అంగరాజవంశము నీ ముప్పుననుండి తప్పించుట యెట్లు? ఏది ఎట్లయినను దప్పించితీరవలయును. తరతరంబులనుండి మాప్రాణముల ధారవోసి అంగరాజ్య సింహాసనమును సురక్షితముగ నుంపఁగల్గితిమి. వేనమహారాజుచేతిలోఁ బడి నేఁటి కీదుర్గతిఁ బొందినది.

గౌతముఁడు : ఛాందసులమైన మేమేమి చెప్పఁగలము? మీవంటివా రూహింపవలసినదే. వైదిక కర్మకాండమా? తర్కమా? మీమాంసయా? మీసంశయములు తీర్చుటకు. అయినను నిరంతర జప తపంబుల మునిఁగి తేలు మా కీ గొడవమాత్ర మేల?

ధృష్టవర్మ : కాని మే మెట్టు లూరటఁ బొందఁగలము? రాజులు వచ్చుచుందురు, పోవుచుందురు. రాజవంశము మాత్రము సుస్థిరమై సింహాసనముమీఁద నుండవలయును.

ఇది మాకోరిక. రాజవంశమునకు నెట్టి యపకారముఁ దల పెట్టము.

గౌతముఁడు : ధృష్టవర్మా! యెంత వెఱ్ఱివాఁడవు! అంగరాజు మ మ్మెంత దయాదాక్షిణ్యములతోఁ జూచెను! మాయం దెట్టి గౌరవము చూపించెను! అట్టి మహారాజువంశము నకుఁ గీడు తలపోయఁగల్గుదుమే? ఇప్పుడు మేము పడు చున్నపా ట్లన్నియు రాజవంశమును గాపాడుటకే.

ధృష్టవర్మ : అట్లయిన మీకుఁ జేదోడు వాదోడుగా నుం దును.

గౌతముఁడు : ధృష్టవర్మా! ఒక్కమాట. పృథుకుమా రుఁడు వినయసంపన్నుఁడు, ఆచారశీలుఁడు, వంశసంప్ర దాయములయందుఁ బక్షపాతియని విందుము. ఇది యెంత వఱకు నిజంబు?

ధృష్టవర్మ : మంచిమాట, సమయమునకుజ్ఞప్తికిఁ దెచ్చితిరి. పృథుఁడు చాల యోగ్యుఁడు. వైదికధర్మపక్షపాతి. ఒక మారు మీదర్శనముఁ జేయింతును. మీరే వానిని బాగుగఁ దెలిసికొనఁగల్గుదురు.

గౌతముఁడు : మహారాజు, పృథుకుమారుఁ డిందులకు వచ్చుట కొడంబడునా?

ధృష్టవర్మ: ఒడంబడఁడని తలంతును, అయిననేమి ? మహా రాజుయొక్క యెఱుక లేకుండఁగనే తీసికొని వచ్చెదను. మీరు మాటాడవచ్చును. అతఁడు కుశాగ్రబుద్ధికల వాఁడు.

గౌతముఁడు: అగును, మంచియూహాయే.

ధృష్టవర్మ: నేను బోయి వచ్చెదను.

[నిష్క్రమించును.]

గౌతముఁడు: కార్యము పాటునఁ బడినది.

మూఁడవ రంగము

ముగింపు

# నాల్గవరంగము.

[వేనునిపడకటిల్లు.]

[వేనుఁ డాలోచనామగ్నుఁడై యిటునటు తిరుగుచుండును.

సునీథాదేవి ప్రవేశించును—వేనుఁడు నివ్వెరపడును.]

వేనుఁడు : తల్లీ! యిది యేమి? యీ కానిప్రొద్దున నిచ్చటి కేల వచ్చితిరి? ఎందులకుఁ దత్తరపడుచున్నట్టు కన్పట్టుచున్నారు?

సునీథాదేవి : నిద్దురపోక నీ వెందులకో యాందోళనపడుచుంటివని బోనకత్తె చెప్పినది. అందుచేఁ జూచి పోద మని వచ్చితిని.

వేనుఁడు : నే నెన్నఁడయిన నాందోళనపడితినా, నేఁడుపడుటకు? ఆందోళనపడవలసిన యగత్యము నా కేల కల్గును?

సునీథాదేవి : బోనకత్తె యట్లేల చెప్పినది? నీయం దేదియో విలక్షణము కన్పించియుండవచ్చును.

వేనుఁడు : భావికార్యగతులనుగూర్చి తలపోయుచుంటిని; అంతియే, వేరేమియు లేదు.

సునీథాదేవి : ఇప్పు డంత తొందర యేమివచ్చినది? క్రొత్త విశేషము లేమయిన నున్నవా?

వేనుఁడు : తొందర యేమియును లేదు. విశేషము లంత కంటెను లేవు. కాని యమ్మా! యొక్కమాట యడిగె దను, జెప్పుము. ఏమఱక పృథువును దినమెల్లఁ గనిపెట్టు కొని చూచుచునే యుంటివికదా!

సునీథాదేవి : మనయాయుష్మంతునినేనా? ఏల యట్లడుగు చున్నావు? ఈప్రశ్నచే నామనస్సు కలవరపడుచున్నది.

వేనుఁడు : ఏమియు లేదు. పృథుకుమారుఁడు తఱచు ముని పల్లెకుఁ బోవుచున్నట్టు తెలియవచ్చుచున్నది.

సునీథాదేవి : [ఉలికిపడి] ఏమీ మనపృథువా? మునిపల్లెకా? చిత్రముగ నున్నదే.

వేనుఁడు : రెండు మూడుసారులు సేనాపతిధృష్టవర్మతోఁ గలిసి పోయినట్టు తెలియవచ్చినది. పోవుటయే కాదు, మును లతో సంభాషించినట్టుకూడఁ దెలియవచ్చినది.

సునీథాదేవి : దేనినిగూర్చి? మునులతో సంభాషించునవ సర మేమి వచ్చినది, కుమారపృథువునకు? ఈడా జోడా? వానప్రస్థములో వలయుమునిపల్లెలునేఁడేలకావలసివచ్చెను?

వేనుఁడు : మునులు దేనినిగూర్చి సంభాషింతురు ? నన్నుఁ గూర్చి, నేఁ జేయుపనులనుగూర్చి. ఇంతకన్నను వారి కేమి యున్నది ?

సునీథాదేవి : ధృష్టవర్మ యుండఁగా నట్టిప్రసంగములు జరుగునా ? జరిగిన ధృష్టవర్మ యూరకుండునా ? నీకుఁ దెలుపకుండునా ?

వేనుఁడు : అమ్మా ! నీకు సంగతులు పూర్తిగాఁ దెలియవు. ఆనాఁటిధృష్టవర్మ యనుకొనుచున్నావు. ధృష్టవర్మమనస్సెవ్వరో విఱిచిరి. అయిదాఱునెలలనుండి ధృష్టవర్మ రాజకార్యములయందుఁ బ్రమత్తుఁడై మెలఁగుచుండుటయె కాక నాకుఁ బ్రతికూలుఁడుగాఁగూడ నుండెను.

సునీథాదేవి : కానికాలము వచ్చునప్పుడు గడ్డిపోచయె పామై కఱచునన్నట్లున్నది.

వేనుఁడు : ధృష్టవర్మ కుమారపృథువును నాపైఁ దిరుగఁబడునట్లు ఋషులచేఁ జెప్పించుటకు మునిపల్లెకుఁ గొంపోయినట్లు నాయనుమానము. అనుమాన మేల ? నిజమే.

సునీథాదేవి : ఔరా ! ధృష్టవర్మ యంతవాఁ డయ్యెను? అన్నముఁ దినిపించుచేతినే కొఱుకఁబూనుకొన్నాఁడే. నేను బిలిపించి మాటాడెదను.

వేనుఁడు : వలదు, అట్టి దేమియు వలదు. నీవు మాటాడి నంతమాత్రముననే తనపనిని మానుకొనువాఁడు కాఁడు. మంచిచెడ్డ లతనికిం దెలియవు. చేతికత్తిమంచిచెడ్డలు దెలియఁగలదుగాని చేతముమంచిచెడ్డలు దెలియనేరఁడు. మొసలిపట్టుమానిసి.

సునీథాదేవి : అయినచో నీవే యాతనితో ముచ్చటించి యతఁడు వినకున్న మితిమీరకమున్నె యాతనిని శిక్షించి నీతోవ నిష్కంటకముగఁ జేసికొనుట యుత్తమముకాదా?

వేనుఁడు : నే నేల యాతని శిక్షింపవలయును? ఎన్నిమారులు నేను మీయాజ్ఞనుమీరి మిమ్ముఁ బ్రతిఘటించితినో యప్పు డెల్ల నన్ను శిక్షించితిరా?

సునీథాదేవి : శిక్షింపకున్న రాజ్యమున విప్లవము చెలరేఁగదా? ప్రాణోపద్రవము సంభవింపదా?

వేనుఁడు : అమ్మా! మిమ్ముఁ బుత్రప్రేమ యిట్లనిపించు చున్నది కాని ప్రాణోపద్రవము సంభవించు నని స్వార్థ మభిలషించి నే నేల ధృష్టవర్మను శిక్షింతును?

సునీథాదేవి : ముక్కుపచ్చలారనిపసిబాలునకు నేమేమియో బోధించి, కుమార్గమునఁ బెట్టి కుటుంబకలహంబును గల్పింప యత్నించుచున్నాఁడుకదా యాతఁడు.

వేనుఁడు : నామతసిద్ధాంతములను బ్రజలకు బోధించి నా వైపునకుఁ ద్రిప్పికొనుటకు నేను బ్రయత్నము సేయుట లేదా? ఎవరియభిప్రాయములను వారు నిరాఘాటంబుగ వెలి బుచ్చికొనుటకును, నితరులకు నచ్చఁజెప్పి తమవైపునకుఁ ద్రిప్పుకొనుటకును నారాజ్యంబున నెల్లరకు సర్వాధికారం బున్నది. కాన ధృష్టవర్మను దాఁ జేయుచున్న కార్యము నుండి విరమింప నే నేటికిఁ గట్టడిచేయుదును. ఇదియుం గాక ధృష్టవర్మకు నీపని కూడ దని చెప్పుట యతనిని రెచ్చఁగొట్టుటయే.

సునీథాదేవి : కుమారా ! ఈ విషమపరిస్థితుల యిరుకటం బున నీ వేమి చేయఁబూనితివి?

వేనుఁడు : పూనుట కే మున్నది? బహుశః మునులు ధృష్ట వర్మతోఁ గలిసి, పృథుకుమారునకు రాజ్యకాంక్ష కల్పించి సిపమెక్కించి యుందురు. ఈకారణముచే నతఁడుకూడ మనమాట పాటింపక పోవచ్చును. నాకో, రాజ్యకాంక్ష దీరినది. ప్రజలకు విజ్ఞానము బోధించి మంచిత్రోవను బెట్టి వారి స్వత్వములను వారి కెఱిఁగింప ననేకయత్నములు జేసితిని. ఇది వలనుకాదని దృఢంబుగ బోధపడినది. ప్రజలు వివేకముతో యుక్తాయుక్తములను విచారించికొని, మేలు కీళ్లను గ్రహింపఁజాలు స్థితియందు లేరు. ఎవరు తమకు హితులో యెవరు కారో సుంతయుఁ దెలిసికొనఁ జాల రైరి. ఎవరికొఱకు నాజీవితసర్వస్వము వెచ్చించి యభ్యు

దయముఁ గూర్ప యత్నించితినో, వారే నా యుద్యమమునకు సుముఖులు కాకపోయిరి. ప్రిక్ృతిజనంబు మఱుకువలో మునింగి తేలుచున్నారు. ఇది కనిపెట్టినవారై మునులు పరలోక సౌఖ్యంబుల సృజించి యడియాసలు గల్పించుచున్నారు. మానులవలలలోఁ జిక్కి ప్రిజలు కీలుబొమ్మ లైరి.

సునీథాదేవి : కుమారా! కర్తవ్య మేమి? యిప్పుడు, వివరించి చెప్పుము.

వేనుఁడు : కర్తవ్య మేమి యున్నది? తల్లీ! పెక్కుమాటలేల! ఈ ప్రిపంచమున నాపని పూర్తియైనది. లోకమును నా యాజ్ఞాబద్ధము జేసికొని యానందమయముగాఁ జేయదొరకొంటిని. లోకము దుర్లోక మయినది. నేను భగ్నప్రియత్నుఁడ నైతిని. నా కిఁకఁ బ్రిపంచముతోఁ బని లేదు. ఈ ప్రిపంచములో, నేఁజేయఁదగినదియు లేదు. ఏబుద్ధుఁడో యీ పాపపంకిలమగు లోకమును నుద్ధరింప వలయును గాని సామాన్యమానవులకు సాధ్యముకాదు. కావున వేనుఁడు నీకడుపునఁ బుట్టలే దనుకొనుము. పృథువే నీకడుపునఁ బుట్టినాఁ డనుకొనుము.

సునీథాదేవి : అమంగళము; అమంగళము శాంతించునుగాక! వినరాని మాటలు చెప్పుచుంటివి. కుమారా! నీ కిట్టి మాటలు తగవు.

వేనుఁడు : అమ్మా! మానులు పసిఁబట్టియున్నారు. నేను జీవించియున్నంతవఱకు వారియాటలు సాగవని వా రెఱుంగుదురు. వారితోఁ బ్రవను నరికట్టుచున్న నన్నుఁ దొలంగింపక యుండనేరరు. పైఁగాఁ జికిలిచేసిన రెండు కత్తులు వారి చేతికిం జిక్కినవి. మొదటిది పృథుకుమారుఁడు; రెండవది ధృష్టవర్మ. ఇఁక వా రెట్లూరకుందురు? మునిపల్లెను గన్నెత్తియైనఁ జూడనొల్లని మనుజులు నేఁడు నిర్భయముగ మునిపల్లెకుఁ బోవుచున్నారు. వారి కేదో గట్టినమ్మకము కల్గకున్న నిట్టిపను లేల జరుగును?

సునీథాదేవి : కుమారా! అయినచోఁ బ్రతీకారప్రయత్నమునైన నేల చేయవు? ప్రతివ్యూహమునైన నేల పన్నవు?

వేనుఁడు : నేను బ్రతీకారమునకుఁ గడంగను. మిథోమారణప్రయత్నమునఁ బుణ్యాపాపము లెఱుంగని జనసామాన్యమేల త్రుంగవలయును? నాకై వేలకొలంది జనంబులు రూపుమాయుటేల? నే నంత స్వార్థపరుఁడను గాను. పదికత్తులు నాపై కెగిరినను నేను కత్తి ముట్టను; కత్తి నెత్తను. నాప్రజలను జీల్చి, యొకరిపై నొకరిని నుసిగొల్పి చీల్చివైవను. నే నిది చూడఁజాలను.

సునీథాదేవి : పుత్రా! ఆత్మరక్షణప్రయత్నమైనను నేల చేయవు?

వేనుఁడు : తనువు లశాశ్వతములు. ఇంతకుమున్ను మరణమును దప్పించుకొన్నవారు లేరు, తప్పించుకొనువారును లేరు. ఇట్టియసాధ్యమైనపనికి నే నేల తహతహ లాడవలయును? నిజముగ మునిపల్లెనున్న మునులు నా ప్రాణమునకే తెగినయెడల నే నెంతకాలము తప్పించుకొని తిరుగఁగలను? "దినదినగండము నూరేం డ్లాయు" వనురీతి నే నేల చరింపవలయును? చచ్చెడునంతదాఁక నిర్భయముగనే ప్రపంచమున సంచరించెదను. నేఁటినుండియు రేయింబవలు నాపడకగదితల్పులు తెఱచియే యుంప నిశ్చయించుకొంటిని.

సునీథాదేవి : కుమారా! నీ విట్టిధర్మనిబద్ధబుద్ధివని యెఱుంగనైతి. నీవంటిప్రజ్ఞాధురీణునకుఁ, బరోపకారశీలికిఁ గన్నతల్లి నగుటచేఁ గృతార్థురాల నైతిని.

వేనుఁడు : మాతృదేవీ! మూసను గరగించిపోసి నా శీలమునకు వన్నె దెచ్చుటకు మీరే కద కారణము. మీ యాశీర్వాదబలమే నాకు జీవగఱ్ఱ. లేనిచో నే నిట్టి మహాకార్యమునకుఁ బూనుకొందునా? మునిలోకము నా ప్రాణములకుం దెగి, నికృష్టమయిన కుటిలు బన్నుచున్నారు. స్వార్థపరులై యేవంపుఁబనులకు దిగుచున్నారు. ఎవ రెన్ని యాటంకములు గల్పించినను, నాధర్మము నెఱవేర్చితీరెదను. తల్లీ! చాల ప్రొద్దు పోయినది. మీరు చని సుఖనిద్రఁ బొందుడు. పృథుకుమారునిమాతృము కనిపెట్టికొని యుండుఁడు.

సునీథా దేవి : కుమారా! నీవు లేనిలోకముతో నాకుఁ బని యేమిటికి? నీవు ధర్మసంస్థాపనఁ జేయుచుండుట కన్నులారఁ గాంచి యానందించు భాగ్యము నాకుఁ బట్టకున్న నీపాపపుఁగనులతో నొం డేల చూతును?

వేనుఁడు : అమ్మా! అట్లనవలదు. మీ రుదాసీన లయినచో రాజ్య మరాజకము గాకుండునా? ప్రజ లుపద్రవములకుం జిక్కకుందురా? ఆర్యఋషులచేతిలోని కీలుబొమ్మయై పృథువు పేరు ప్రతిష్ఠ లేకుండఁబోవకుండునా? ప్రజాక్షేమమునకయి మీరు పాటుపడవలసిన యగత్యము లేదా?

సునీథా దేవి : కుమారా! నే నేదియో నిశ్చితాభిప్రాయమునకు వచ్చితిని. నన్ను బలవంతపెట్టకుము. చాలఁ బ్రొద్దుపోయినది. నేఁ బోయి పరుండెద. నీవు కూడఁ బరుండఁ బొమ్ము.

వేనుఁడు : తల్లీ! నీవు సర్వజ్ఞురాలవు. నీకు నే నేమి చెప్పఁగలను? నీమాటలకు నీవు గాదని చెప్పుటకుఁ గూడ సాహసము లేదు. నీయిష్టమువచ్చినట్టు లాచరింపుము.

సునీథా దేవి : నేఁ బోయివచ్చెద.

వేనుఁడు : చిత్తము. [పచారుచేయుచు] ఆర్యఋషు లెంతకుఁ బూనిరి! ఇంత స్వార్థపరత్వ మెచ్చటను గన్పట్టదు.

నే నెంత తర్కించుకొన్నను, వీరిపైఁ గత్తిదూయుటకు మన స్సొప్పకున్నది. నాపరిష్కృతి బాగుగా నెఱింగిన ధృష్టవర్మ వీరి కుపోద్బలంబుగా మాటాడుచుండును. లేకున్న ఋషుల కింత సాహస మెక్కడిది? ఈ యాధితో నే బాధపడఁ జాలను. దుర్మరణమా! మరణమునకు మంచి చెడ్డ లేమున్నవి? త్వరగాఁ దేలిపోవుటయే మేలు. విరోధులను బ్రతిఘటించి నారాజ్యమున శాంతిభద్రములు లేకుండఁ జేసి యల్లకల్లోలమును జేయనేరను. నాపడకటింటితలుపు లన్నియుఁ దెఱచియే యుంచెదను. హాయిగా నీరేయి నిదురింతును, మరల నీయవకాశము దొరకునో దొరకదో. [పరుండును.]

[నిషాదుని ప్రవేశము; అంపపొదియు విల్లు నెగు మూపునఁదాల్చి,చికిలిచేసిన కత్తి చేతంబట్టి వేనమహారాజుపడక గదిముందు తూఁచివేయుచున్న యడుగులతో నిటు నటు తిరుగుచుఁ గావలికాచుచుండును. పదముల చప్పుడుచే వేనుఁ డులికిపడి లేచి]

వేనుఁడు: ఎవరు వారు? నాపడకగదిముం దీవేళ నొంటరిగఁ దిరుగుటకుఁ గారణమేమి? ఓహో నిషాదా! నీవా?

నిషాదుఁడు: అగును, నేనే నిషాదుఁడను.

వేనుఁడు: ఎచ్చటనుండి యూడిపడితివి, ఎన్నాళ్ళకు? ఈ

పిలువని పేరంటమున కేల వచ్చితివి ? అంతయుఁ గలగా నున్నదే.

నిషాదుఁడు : పిలువని పేరంటమునకుఁ బోవుట మాజాతిప్రధానలక్షణము. అదియుంగాక మమ్మెవరు బొట్టు కాటుక పెట్టి పేరంటమునకుఁ బిల్తురు ? మే మేమయిన రాజులమా, నాగరకులమా ?

వేనుఁడు : ఎప్పుడును బరిహాసములేనా ?

నిషాదుఁడు : పెద్దలతోఁగాక నే నెవరితోఁ బరిహాసములాడుదును?

వేనుఁడు : (ఎగా దిగా చూచి) చాలులేవోయి, యీ యెక్కసక్కెములు? ఈ వేష మేమి? పొలికలనికిఁ బోవుచుంటివా? పొలికలనినుండి వచ్చుచుంటివా ? జానెడు లేవు; ఈవిల్లమ్ము లేమి ? ఈకత్తి యేమి ? ఈమైమఱు వేమి ? ఈ కాసెకోక యేమి ? ఏదోయుద్ధమునకు సిద్ధమై వచ్చినట్టు లీ వేషభాషలు చెప్పక చెప్పుచున్నవి.

నిషాదుఁడు : దేవా ! యేలుకొనుటకు రాజ్యము లిచ్చితివా? కాపురముఁ జేయుటకు నగరము లిచ్చితివా ? అన్నిటికిఁ గాఱడవులే కదా ! కాఱడవులలో వాసముఁజేయు మాకుఁ గత్తులు, కటారులు, కాసెకోకలు కాక మూటలు, ముల్లెలెచ్చటినుండి వచ్చును ? గాండ్రను పెద్దపులులు, గీపెట్టు

నేన్గులు, బొబ్బరిల్లుసింగములనడుమఁ గాఁపురముఁ జేయు మా కివి కాక యేమి యుపకరించును ?

వేనుఁడు : కుమారా ! యూరక సూటిపోటిమాట లను చున్నావు. నేను మీకుఁ గాఁణడవులు వాసముఁజేయుట కొసంగలేదు. నీతల్లికోర్కెమీఁదనే కాఁణడవులు మీకు మనికిపట్టు లైనవి. వృథా యేల నామనస్సు నొప్పింతువు ?

నిషాదుఁడు : క్షమింపుఁడు, మహాపచారముం జేసితిని. మీ మనస్సు నొచ్చునెడల నేఁ జూడలేను.

వేనుఁడు : [మిగుల బాళితోఁ జేయి పట్టుకొని మొగమున దృష్టి నిలిపి] ఎక్కడనుండి యీ రాఁక చెప్పవూ?

నిషాదుఁడు : చెప్ప కేమున్నది ? హఠాత్తుగా నాకు వేఁటపై మనస్సు పోవ, మునిపల్లెసమీపములో నున్న కాఱు కోనలోఁ బొడలజింకలు విచ్చలవిడిఁ దిరుగును గాన నటకు మునిపల్లెమీఁదుగాఁ బోవుచుంటిని.

వేనుఁడు : నీకుఁ బొడలయిఱ్ఱిమాఁసమన్న నంతనోరూరునా? నీవు పూర్వజన్మమున నార్యఋషివి గాఁబోలు.

నిషాదుఁడు : నేనా ? పూర్వజన్మముమాట యేమియో కాని యీజన్మమునమాత్ర మార్యసంబంధము కల్గినది. ఇందుచేతనే రెంటికిం జెడినరేవఁడ నైతి. ఇటు తల్లివైపు

వారికిఁగాని, అటు తండ్రివైపువారికిఁ గాని నాయందు సంపూర్ణవిశ్వాసము లేదు. దానితో నేమి? పూర్వజన్మమున నార్యఋషినేమో యంటిరి, యిది యెట్లు?

వేనుఁడు : ఆర్యఋషులకుఁ బొడలయిల్లిమాంసము చాల రుచ్యమైన భోజనపదార్థము. కాని, కుమారా! నీ వింకను మాంసమును దినుట మానలేదుగా?

నిషాదుఁడు : మాంసముఁ దినుట మా వాజ. మహారణ్యములో పడ్రిసోపేతమైన భోజన మెట్లు దొరకును? అయినను గన్నతండ్రిమాట పాటింపకుండ జవదాటుటకు మే మార్యులమా? ఆర్యయువతీగర్భమునఁ బుట్టితిమా? మూడేండ్లకిది తొలుసారి, యీ పాడుబుద్ధి పుట్టుట. ఇంతకు వేఁటకుఁ బోవలేదు, మాంసముఁ దినలేదు.

వేనుఁడు : కారణము?

నిషాదుఁడు : కారణమా? నిష్కారణమే. నిష్కారణముగా మన మెన్ని పనులు చేయుచుండుటలేదు? వానిలో నిది యొకటి.

వేనుఁడు : కాదు, కాదు. ఏదో కారణ ముండితీరవలయును. కుట్టా! రమ్మ, చెప్పుము.

నిషాదుఁడు : మునిపల్లె దాఁటి నాలుగడుగులు పోవుసరికి మీ

యానతి జ్ఞాపకమునకు రాఁగా గిరుక్కున మగిడి మిమ్ము సందర్శించుటకు బుద్ధిపుట్ట నిచటకు వచ్చితిని, ఇంతియె.

వేనుఁడు : నీవు నిజమును గప్పిపుచ్చుటకు యత్నించుచు న్నావు. ఎచ్చట నేర్చికొంటి వీవిద్యలు? నీవాలకము నాకు నచ్చుటలేదు. నోటితో మాటాడుచు నొసటితో వెక్కి రింతువు. మఱుఁగుమాటలచే నెఱకలు దూరనాడుదువు. ఎక్కడనుండి వచ్చిన దీచాలు?

నిషాదుఁడు : మీ రూహించలేరా? ఇదికూడ నేను చెప్ప వలయునా?

వేనుఁడు : ఊహింపలేకున్నాను.

నిషాదుఁడు : పెద్దలు చెప్పుదురుకదా, మేనమామపోలిక మేనత్తచాలిక యని. తల్లిచాలుమాత్రము కాదు.

వేనుఁడు : కుమారా! నీవు చాల తుందుడుకుబిడ్డఁడ వైతివి. నిజముగ నన్ను దర్శించుటకే వచ్చినయెడల దర్శించితివి కదా, యిఁక మగిడిపొమ్ము.

నిషాదుఁడు : కన్నతండ్రియింటికి నెన్నినాళ్లకో వచ్చితిని. ఒకపూట యుండఁగూడదా? ఒకరాత్రి మీ పడకగది ముందు జాగరణము సేయరాదా?

వేనుఁడు : నాపడకగదియం దేమి, జాగరణ మేమి? వలదు, వలదు. నాకు సేవకులు లే రనుకొంటివా?

నిషాదుఁడు : మీకు సేవకులు లేకయుందురా? నాకు శరచాపములు లేకయుండునా? సేవకులు స్వామిద్రోహులు కాకుండవలయును, శరములు మొక్కవోనివి కావలయును నాత్మరక్షణకు. ఇంతకును సేవకులయం దుంచినవిశ్వాసము కన్నబిడ్డలయం దుంచలేరా ? నే నాటవికుఁడను. నాకు రాజ్యములతోఁ బని లేదు. భోగభాగ్యములతోఁ బని లేదు. ఎవ్వ రేమన్నను నేను జాగరణముఁ జేసితీరెదను.

వేనుఁడు : ఏమీ మొండితనము ? నేను వలదన్నను జాగరణముఁ జేసితీరెద నందువు.

నిషాదుఁడు : తండ్రిపోలిక, విత్తన మొకటి, చెట్టొకటియా ?

వేనుఁడు : కుమారా ! ధన్యుఁడవు, ధన్యుఁడవు; కాని నీవు చేయగలఁ దెద్దియును లేదు. అంతయును జేయి మీరిపోయి నది.

నిషాదుఁడు : దేవా ! ఎన్నఁడు వినరానిమాటలు వినుచుంటిని, మీవలన. చేయి మీరిపోవుట యేమి ? నాపొదిలో నమ్ము లున్నవి, నాయొడలిలో వేఁడినెత్తు రున్నది, నాచేతిలో సత్తువ యున్నది, నాకత్తికిఁ గఱకుపద నున్నది.

వేనుఁడు : కుమారా! నీవు పసిబాలుఁడవు; ఒక చెంపఁ గొట్టినఁ బాలు, ఒక చెంపఁ గొట్టిన నెత్తురు గారును. ఇట్టి నీచే నగునది యేముండును? నామాట నమ్ము, మగిడిపొమ్ము.

నిషాదుఁడు : ఇ వన్నియు నిజము కావచ్చును. కాని వీని నన్నింటిని సరకుపెట్టనీయనిది యొక్కటున్నది.

వేనుఁడు : ఏది యది?

నిషాదుఁడు : నిషాదుఁ డెన్నఁ డవమాన మెఱుంగఁడు. ఒక వేళ నవమాన మీఁగవలసివచ్చినచోఁ బ్రాణమును పణముగా నొడ్డఁగలఁడు. ఇది జాతిలక్షణము.

వేనుఁడు : కుఱ్ఱా! యివి నే నెఱుంగనివా? నాయెదుట నేకరువుపెట్టవలసిన యవసర మేమి వచ్చినది?

నిషాదుఁడు : నారాకకుఁ గారణ మడిగితిరిగదా?

వేనుఁడు : ఇప్పుడు కారణ మేమి చెప్పితివి?

నిషాదుఁడు : మాయింట నొకరికి నవమానము వాటిల్లనున్నచో నది తప్పించు బాధ్యతయు, వాటిల్లినచో నీగవలసిన బాధ్యతయుఁ గుటుంబముది. కుటుంబమున నొక హత్య జరిగినచోఁ బగవారిగొంతి(?)న్నెత్తురు తనివిదీర మా కత్తులచేఁ ద్రావింపకమానము. మొక్కవోని వాడిగల మాకత్తు లాత్మరక్షణముఁ జేయఁజాలియుండును.

వేనుఁడు : బిడ్డా! యింత వాగ్ధోరణి యేల!

నిషాదుఁడు : మీ రాటంకపడి యడుగుటచేఁ జెప్పవలసివచ్చినది. నాపనిని నన్ను నెఱవేర్చికొననిచ్చినచో నీవాగ్ధోరణితో నిజముగఁ బనియే లేదు.

వేనుఁడు : నే నేమి యాటంకపడి యడిగితిని?

నిషాదుఁడు : నే నీవేళ నిచ్చటకుఁ వచ్చుటకుఁ గారణము.

వేనుఁడు : కారణముఁ జెప్పకుండ నింత వాచాలుండ వైతివే!

నిషాదుఁడు : నన్నుఁ గారణము చెప్పనీయనిదె.

వేనుఁడు : చెప్పుము, విందును.

నిషాదుఁడు : న న్నిట కీడ్చికొనివచ్చి, రేయెల్ల జాగరణము సేయవలసినదని మా యాటవికధర్మ మొక్కటి నన్నుఁ బ్రబోధించుచున్నది.

వేనుఁడు : ఆయాటవికధర్మ మేది?

నిషాదుఁడు : పితృరక్షణము. జనకుఁడు సర్వస్వమునకు నధినేత. ఒక్కయభిమానముదక్క సర్వమును వెచ్చించి జనకుని గాపాడుట మాసంప్రదాయము, మాయాచారమును.

వేనుఁడు : [ఉలికిపడి, యానందబాష్పములు జడిగొనుచుండ, మూర్ధ మాఘ్రాణించి బాష్పరుద్ధకంఠుఁడై కొంతవడి యేమియుఁ బలుకనేరక యెట్టకేలకుఁ దెప్పిరిల్లి] కుమారా, ఇఁకఁ బ్రశాంతముతోఁ బ్రాణము విడెదను.

నిషాదుఁడు : నిషాదునిబొందిలో జీవ ముండఁగా మీ కట్టి యవసరముకలుగదు. ధర్మము శాశ్వతము, శరీరము వినశ్వరము. వినశ్వరమగు పదార్థము నభిలషించి, ధర్మము నేల యుజ్జగింపవలయును? మాయమ్మ చిన్ననాఁ డొక్కపాట నేర్పినది.

వేనుఁడు : తండ్రీ! యాపాటఁ బాడుము, వినవలయును.

నిషాదుఁడు : నేను పాటలు పాడలేనే?

వేనుఁడు : అమ్మ నేర్పని, పాటఁబాడని నిషాదుఁ డుండునా? నేను నమ్మను.

నిషాదుఁడు : చేతనయినట్లు పాడుదును.........

వేనుఁడు : పోయినకాలము స్మరణకు వచ్చుచున్నది తండ్రీ! కాని యీ యాసన్నమరణముఁ దప్పింపలే వని నామనస్సాక్షి చెప్పుచున్నది.

నిషాదుఁడు : మనస్సాక్షి తలఁచు కూటసాక్షి యగుచుండును. తప్పింపఁగలుగుదునో లేనో యది నాపని. తప్పింప

లేనిచో నా పీనుఁగుమీఁదుగనే పగతుర కరాచురకత్తి మీఁపయి కెగయును.

వేనుఁడు : ఈమాటలు నేను వినలేను. అంటు సొంటు లేని ప్రజలు మడియుదురేమో యను భయంబున ఋషులపై దాఁడియెత్తమాని మరణింపనుంటిని. అట్టి నాకై నీవు మ్రిందుటయేల ?

నిషాదుఁడు : అంటు సొంటు లేని ప్రజలక్షేమమునకై మీరు మరణమునకే యున్ముఖు లగునప్పుడు, అంటు సొంటు గల్గు మీకై నాప్రాణమును బూటవెట్టుట దోషమా ?

వేనుఁడు : ఈ ప్రపంచమును రోసి వీడఁదలంచుకొన్ననాకై తెగటారుట యేల ?

నిషాదుఁడు : నేనుమాత్రి మిచ్చట నుట్టి గట్టుకొని యూరేగుదునా ? ఎప్పుడో యొకప్పుడు చావవలసియే యున్నది. నాతల్లి చిన్నతనముననే పరమపదించెను. 'నా' యన్నవారు మీ రొక్కరే నాకు. మిమ్ములఁ గాపాడుకొనఁ గల్గుదునా పరమానందమున నోలలాడుదును. లేదా మీ తోడిదే లోక మగును. కావున నన్నుఁగూర్చి మీరు చింతింపవలసినదిలేదు. నాపని నన్నుఁ జేసికొననిండు. అలసిన ట్లున్నారు. ఈరేయి హాయిగా నిద్దురించుఁడు. ఏమరక

నేను గావలిగాచెదను. నిషాదునిశరచాపములుగాని కరాళ ఖడ్గముగాని సామాన్యమైనవి కావు.

వేనుఁడు : ఎఱుంగుదును, కాని మనస్సంక్షోభము గావించు నీపరిస్థితులలో నా కెట్లు నిదురవచ్చును ?

నిషాదుఁడు : జనకా ! నే నెఱుంగనా మీస్వభావము? నా దగ్గఱ దాఁచెద రేల? మీకుఁ జిత్తసంక్షోభ మెన్నఁ డుండును ? ప్రశాంతమును, గభీరమును నైన మీ మన స్సెవరు కలఁతపెట్టఁగలుదురు ? వానచినుకులకు సముద్ర మల్లకల్లోలమగునా ? మైమఱచి నిద్దురవోవుఁడు.

వేనుఁడు : కలలు వచ్చును. నామనస్సు చెడినది. కలలో నీ మూర్తియే, నీమాట లే. నిద్దురపోవలేను.

నిషాదుఁడు : చాల ప్రొద్దుపోయినది. ఊరక వాగ్వాద మేల పెంచెదరు, నిదురించుఁడు.

వేనుఁడు : కుమారా! నీమాటల కెదురాడలేకుంటిని. నిన్ను సంప్రీతుని జేయుట కేమయినఁ జేతును. ఇదిగో! నిదురింపఁ బోవుచుంటిని. [వేనుఁడు పడకమంచముపై మేను వాల్చును. నిషాదుఁడు కత్తి చేతఁబట్టి గదిముందుఁ గావలిగాచుచుం డును. ధృష్టవర్మయుఁ బృథుకుమారుఁడును ఖడ్గములు

ధరించి యీ వేశముతోఁ బ్రవేశించుచుందురు. నిషాదుఁడు చెవులు రిక్కించి చప్పు డాలకించి]

నిషాదుఁడు : ఎవ్వరు వారు? ఈయర్ధరాత్రివేళఁగాలిచప్పుడు కాకుండ రాజమందిరముఁ బ్రవేశింప నుంకించుచు న్నారు. [పరికించి] ఓహో! ధృష్టవర్మప్రభృతుకుమారులా? ఇంచుకంతయు నేను బొరపడి యుండలేదు. కింవదంతి కాదు. సత్యమునే వింటిని. మీ రచ్చటనే యాగుఁడు. ముం దంజ వేయకుఁడు. బడలికపడి యిప్పుడే మహారాజు నిద్రించు చున్నాఁడు. నిద్రాభంగ మగును. ఇది నేను సహింపలేను. మీ కేది కావలసిన నది యీయ సమర్థుండ. అదిగో! సమ ప్రదేశము. అచ్చటికిఁ బోదము, నడువుఁడు. తామసింప కుఁడు. మగుడ రేల?

ధృష్టవర్మ : నిషాదా! న న్నెవ్వరిగాఁ దలంచి యీసాహస వాక్యములు పలుకుచున్నావో కదా! ఎఱుంగుదువా?

నిషాదుఁడు : ఎఱుంగ కేమి? వేనమహారాజు సైన్యాధిపతి వనియు, వేనమహారాజును ఖూనీచేయుటకే యీ వేళనే వత్తువనియు, వచ్చితివనియు, నీ కార్యకలాపము చక్కఁగా నెఱవేర్పించుటకు, యువరాజు తోడునీడై వచ్చెననియు నెఱుంగుదును. ఒకరు స్వామిద్రోహులు, ఒకరు పితృ ద్రోహులు; ఒకరు కానున్న స్వామిహంతకులు, ఒకరు

కానున్న పితృహంతకులు. కావుననే యీయంతఃపురమును మీపాదధూళిచే నపవిత్రముఁ జేయకమున్న మరలుఁడు.

పృథువు : నిషాదా! తెగఁబడి మాటాడకుము. మీ రెవ్వరో యెఱింగియు నట్లేల పేలెదవు?

నిషాదుఁడు : నోరు నొక్కేద నింకొకమాట మాటాడిన, మహారాజు లేవకమున్నే యీప్రదేశమునకుఁ బోదము నడువుఁడు.

ధృష్టవర్మ : మహారాజు లేచిన నేమి సేయఁగలఁడు? భయ పెట్టకుము.

నిషాదుఁడు : నన్ను మీతోడఁ బోరాడకుండఁ జేయును. దానిచే నిషాదునికఱకుకత్తిచుఱుకుపదను రుచిచూచు భాగ్యము మీకుఁ గలుగదు.

ధృష్టవర్మ : ఓహో! నీవా మహారాజును గాపాడునది?

నిషాదుఁడు : కాపాడలేకున్న వీరపురుషోచితమయిన వీర స్వర్గముఁ బొందెదను. మీవలె స్వామిద్రోహము పితృద్రోహ ముఁ దలంచునంతటినీచుఁడను గాను. వెనుకకుఁ దిరుగ రేమి? మీయందు సుభటలక్షణములుకూడఁ గన్పట్టవు. మహా రాజు నిద్ర మేల్కాంచునని యవలకుఁ బొమ్మన్నను

బోరేమి? ఆ సమప్రదేశమునకుఁ గదలుదురా లేదా? మఱుమాట చెప్పవలదు.

[ధృష్టవర్మయుఁ బృథుకుమారుఁడును విభ్రాంతులై ముందు నడుతురు. నిషాదుఁడు వెనుకనే పోవును. ఒడలు తెలియని సివముతోడను, నెత్తుటం దోఁగినకత్తితోడను, రక్తముఁ గ్రక్కు నొడలితోడను ధృష్టవర్మ పృథుకుమారులు ప్రవేశింతురు. ధృష్టవర్మ నిదురించుచున్న వేనరాజుపడకకడకుఁ బోయి దీర్ఘకరవాలముచే నెదుఱొమ్ము దూసిచనఁ బొడువ వేనరాజు కన్నులం దెఱచి యిటునటు పరికించి]

**వేనుఁడు :** నీవా! ధృష్టవర్మా? నీపనిని దీర్చికొమ్ము. పసితనంబునుండి పెంచి పెద్దను జేసి యన్యదుర్లభమైన యధికారమిచ్చి మన్నించినందులకుఁ బ్రతిఫలంబుగా నన్నిట్లు గౌరవించుచుంటివా? కానిమ్ము, ఇదియొక మేలు. ఏ మానిచేతులలోనో పడి చావక కన్నబిడ్డవంటి నీచేతులలో మరణించుటచే నే నాత్మశాంతిని బొందుచుంటిని. ధృష్టవర్మా! ఇట్టిది తటస్థించు నని నేను జాలకాలమునుండి యెఱుంగుదును. ఎఱింగియు నీయందలి వాత్సల్యముచే నేమియుఁ జేయనేరక యూరకుంటిని. [పృథుకుమారుని వైపునకు దృష్టి మరల్చి] పృథూ! పృథూ! ఏఁడీ నిషాదుఁడు? నిషాదుఁడేఁడీ? [ధృష్టవర్మ మరల పొడుచును.]

పృథువు : నిషాదుఁడు కావలసివచ్చెనా? నీకు ముందుగ దారితీయుటకుఁ బంపియుంటిమి.

వేనుఁడు : నిషాదా! నిషాదా! [యని హీనస్వరంబునఁ బిలిచి ప్రాణములు వీడును.]

[ధృష్టవర్మ వెఱ్ఱిచూపుల నదేపనిగా రాజును జూచుచు మైమఱచి యుండును; పృథుకుమారుఁడు తండ్రిప్రక్కకు వచ్చి తేఱిపాఱఁ జూచి ధృష్టవర్మవెన్నుఁ దట్టి]

పృథువు : ధృష్టవర్మా! యేమది? దిగాలుపడి చూచెద వేల? కావలసినపని పూర్తియైనది. మహారాజు ప్రాణములఁ బాసెను. లోక ముపద్రవముఁ బాసెను.

ధృష్టవర్మ : ఏమీ, ఏమీ! మహారాజు ప్రాణములం బాసెనా? ప్రాణములం బాసెనా? ఆహా యెంత ఘోరము! ఎంత ఘోరము! పాపిని, చండాలుఁడను, ఎంత ఘోరకృత్యముం జేసితిని!

పృథువు : ధృష్టవర్మా! యేమి యీ వాపోవుట? ఇంత పిఱికిపంద వెప్పుడైతివి?

ధృష్టవర్మ : [వికటంబుగ] ఎప్పుడైతినా? మునులచేతిలోఁ బడినప్పుడు, యువరాజుచెలిమిఁ జేసినప్పుడు, కుట్రలు పన్న మొదలిడినప్పుడు. యువరాజా! నేఁటినుండియు మహారాజవు గాఁబోలు; నీ వెఱుంగవు; నీ వెఱుంగఁజాల వీ

మహారాజుపవిత్రహృదయము, పరార్థజీవనము, అద్భుతౌదార్యము. మనవంటి స్వార్థపరు లెన్నం డీ మహామహుని దెలియంజాలరు. కసిగందుని బెంచి, పెద్దవానిం జేసి, సర్వసైన్యాధిపత్యమిచ్చి, నమ్మినందులకుఁ బ్రతిఫలంబు పెద్దపులినై వేఁడినెత్తురు గుటగుటఁ దాగివిడిచితిని. ఈ మనఃపరితాపము భరింపఁజాల; ఈ తాపము సహింపఁజాల; ఆపాదమస్తకము దహించి వైచుచున్నది. దుర్భరము, దుస్సహము. [వేనరాజుపైఁ బడి] మహారాజా! పల్కవేమి? ఈ నికృష్టజీవికి, నీ కృతఘ్నునకుఁ బ్రాయశ్చిత్తదండన విధింపవా? రాజదండనచేఁ బరలోకదండన తొలంగిపోవునని పెద్ద లందురు. దండ్యుల శిక్షించుట రాజధర్మముకాదా? మాటాడవేమి? [క్రింద నున్న కత్తిని దీసి చేతఁ బట్టుకొని ఘోరాకారుఁడై] ఎవ్వఁడీ మహారాజును దుర్మరణంబుపాలు చేసినది? వానిమస్తక మీకరవాలముచే శతధా భిన్నముఁ జేసి పుత్తును. ఓరీ పిఱికిపందా! నాకంటం బడవేమి? ఎవఁడు వాఁడు? నిషాదా! నీవా? నేను మహారాజునకు ద్రోహముఁ జేయను. నీకత్తిని దింపివేయుము. నీకే చెప్పుచున్నది. నిషాదా! నీకత్తిని నొఱలోఁ బెట్టుము. ఏమీ యీ యా వేదన! [వేనునిం జూచి] మహారాజు మరణించెనా? నాచేత మరణించెనా? నేను జూడలేను. పుట్టిననాఁటఁగోలె నీ పాపితోడునీడగా లేకుండ నెచ్చటికైనఁ బ్రయాణముఁ జేసియుంటివా? ఇతఁడుదక్క నెవ్వరయిన నీ కూడిగంబుఁ జేసియుండిరా? ఇప్పు డేల నాసేవఁ గైకొనవు? నీవు గైకొన

కున్న నే విడుతునా ? ఎవ్వరో నాకంఠమును రెండుచేతు లంబట్టి నులిమివైచుచున్నారు. ఊపి రాడకున్నది. ఈబాధ భరింపఁజాల. [పడియుండును.]

గౌతముఁడు : [ప్రవేశించి పరికించి] ఏమి చిత్రము ? ధృష్ట వర్మ యింతలో నున్మత్తుఁడై పోయినాఁడే. వేనునియం దితనికి నవ్యాజమును, నపారమును నైన భక్తివిశ్వాసములు కలవు. ఇతనిని మావైపునకుఁ ద్రిప్పుకొనుటకుఁ జలప్రాణము తోఁకకు వచ్చినది. ఎన్ని మాయమాటలు చెప్పితిని! ఎన్ని యబద్ధము లాడితిని! ఎన్ని యధర్మముల ధర్మములుగా నిరూపించి చెప్పితిని! [ముందుకు నడచి పృథువుం జేరి] మహారాజా ! ఏమట్లు చూచుచున్నావు ? ధృష్టవర్మ పిచ్చివాఁడై పోయినాఁడు. ఇతండు బాగుపడినచో మనకుఁ బ్రక్కలోనిబల్లెమగును. ఇప్పుడుండి యుండి నీమీఁదికో నా మీఁదికో యురుకకమానఁడు. ఈయున్మాదావస్థలోనె వీనిని దుదముట్టించుట భూతహిత మగును. నావంక నెట్లురిమి చూచుచున్నాఁడో చూడుము, కత్తిని దీసికొనుచున్నాఁడు.

ధృష్టవర్మ : [లేచి] మహారాజా! నీ వెక్కడ కేగినను సరియె, యచ్చటకు వచ్చి సేవఁ జేసెదను.

గౌతముఁడు : మహారాజా ! స్నేహితులను విడఁదీసియుంచుట న్యాయముకాదు. పైపెచ్చు ధృష్టవర్మ వేనమహారాజు

కడకు నేవక్కై పోవ నిశ్చయించుకొన్నాఁడు. ఆలసింపకుము. అదుగో కత్తిని దీసినాఁడు.

పృథువు : దేవా! భయపడకుము. పృథువు మీా కే యాపద రాకుండఁ గాపాడఁగలఁడు.

గౌతముఁడు : ఇం కేమున్నది? కత్తిని బట్టి లేవఁబోవు చున్నాఁడు.

పృథువు : గౌతమమునీంద్రా! అతండు లేవకుండఁగనే మడి యును.

[చరాలున కత్తిఁదీసి ధృష్టవర్మశిరంబు భిన్నమై పడఁ గొట్టును.]

నాల్గవరంగము

ముగింపు

# పాట

పుట ౭౫ : పంక్తి ౧౪



పగవారు మనపైకి వచ్చిపడ్డారు
కోయంచు మనయూళ్ళు కొల్లగొట్టారు
గూటిలో పిట్టల్ని కూల్చివైచారు
పొలములో పసిలేళ్ళ పొడిచివైచారు
మరచి పోవద్దోయి మరచిపో వద్దు
మనజాతి యగచాట్లు మరచిపో వద్దు

కారుకోనలు దూరి కలిగి పొయ్యారు
దుంపకూరలతిండి ద్రుంగి పొయ్యారు
గోచిపాతలు కట్టి క్రుంగి పొయ్యారు
ప్రొద్దెల్ల మనవారు పొగిలి పొయ్యారు
మరచి పోవద్దోయి మరచిపో వద్దు
మనజాతి యగచాట్లు మరచి పోవద్దు

పంగిళ్ళ కయ్యాల పంట్రించినారు
పసిపాప యుయ్యాల పార దన్నారు
నిదురపో నీకోయి నీచేతికత్తి
త్రాగించు పగవారి రక్తంబు నెపుడు
మరచిపో వద్దోయి మరచిపో వద్దు
మనజాతి యగచాట్లు మరచిపో వద్దు

